గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# కంకంటి కవితా వైభవం

రచన

'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి

రౌద్రి శ్రీరామనవమి
25-3-1980 నాటి
ఆవిష్కరణ సభలో
డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం
గారికి.
శుభాకాంక్షలతో
యువభారతి.

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం : 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

[illegible]

KANKANTI KAVITA VIBHAVAM

Poete Selcetions From Kankanti Paparaju's

'UTTARA RAMAYANAM'

By 'KARUNASRI' JANDHYALA PAPAYYASASTRI



యువభారతి

ప్రచురణ : 64

ప్రథమ ముద్రణ :

రౌద్రి శ్రీరామనవమి

25 మార్చి 1980

ప్రతులు : 1,200

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు.

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,

హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ :

గీతా ఆర్ట్ ప్రింటర్స్,

హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి

5 కింగ్స్‌వే, సికిందరాబాద్-500 003.

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు

తిలక్ రోడ్, హైదరాబాద్-500 001

వెల రూ. 3/-



Paper Used for the Printing of these books
was made available by
the Government of India at concessional rates.
YUVABHRATHI IS GRATEFUL



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినపుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదహారేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 66 ప్రచురణలను ప్రచురించి 3 లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే - యువభారతి నిర్వహిస్తున్న సాహితోద్యమంలో పాలుపంచుకో గలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 6000 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 700 మంది, భారతీ భూషణులుగా 60 మంది చేరారు.

ఉదుతాభక్తితో మేము చేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

రౌద్రి శ్రీరామనవమి
25 మార్చి 1980

డా. ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు : యువభారతి.

# మామాట

ప్రబంధం అనే మాటకు సంస్కృతంలో కవిత్వం అని అర్థం. కాని తెలుగులో ఒక విధమైన కావ్యప్రక్రియకు పేరు. ఏకనాయకమై శృంగార వీరరసప్రధానమై కమనీయ వర్ణనాత్మకమై వర్తిల్లే కావ్యం తెలుగులో ప్రబంధం అనిపించుకుంటుంది. ఒక్కొక్కటిగా పురాణాలు తెలుగులోకి వస్తునప్పుడు శ్రీనాథుడు నైషధాన్ని కవిత్రయంవారు చూపిన మార్గంలో తెనిగించి ఈ ప్రబంధ ప్రక్రియకు నారు పోసినాడు. పెద్దన, తిమ్మన, భట్టుమూర్తి, సూరన ఈ ప్రంబంధవల్లరికి నీరుపోసి దోహదం చేసి నిత్యకవితా సౌరభాలను గుబాళించే ప్రబంధాలను అందించినారు. రెండు శతాబ్దాల పాటు ఈ ప్రబంధాలు ఒయ్యారాలు ఒలుకుతుం టే కంకంటి పాపరాజు మళ్లీ పురాణరచనకు పూనుకున్నాడు. అయితే ఈ పురాణరచనకు ప్రబంధ వర్ణనలను పులిమి ఒక కొత్త పుంతను తొక్కినాడు. ఆతని 'ఉత్తర రామాయణం' అలాంటి కొత్త ప్రక్రియకు దృష్టాంతం. సమకాలిక (17వ శతాబ్దం) ప్రజాజీవితం లీలగా కనిపిస్తుందీ కావ్యంలో. సుందరమైన పదబంధాలకు శ్రవణసుఖదమైన సమాసాలకు ధారాశుద్ధి పద్యాలకు ఈ కావ్యం కాణాచి.

ఈ కావ్యంలోని కొన్ని పద్యాలను ఏరి, వాటిలోని కవితా సౌందర్యాన్ని విప్పిచెప్పి పాపరాజు హృదయాన్ని ఆవిష్కరించినవారు 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు 'కరుణశ్రీ' గారు విద్వత్కవులు. మధుర మంజులములైన లలిత పదాలలో మహనీయార్థాన్ని ప్రతిపాదించగల ప్రతిభా మూర్తులు. ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ వంటి కావ్యాలను, కల్యాణ కాదంబరి వంటి వచన కృతులను, కల్యాణ కల్పవల్లి వంటి సత్కవితా సంకలనాలను అందించిన రస హృదయులు. బాలలకు వాఙ్మయ సృష్టి చేసిన సరళ స్వాంతులు. సహృదయ హృదయాహ్లాదకరంగా ఉపన్యసించగల వాగ్మివతంసులు. మా యువభారతి వేదికపై తెలుగు రామాయణాలను గూర్చి, నాయని సుబ్బారావు గారిని గూర్చి చేసిన ఉపన్యాసాలు వారి సద్విమర్శనకు చక్కని నిదర్శనాలు. శ్రీ శాస్త్రిగారు మా అభ్యర్థనను మన్నించి కంకంటి పాపరాజు కవితా వైభవాన్ని వ్రాసి యిచ్చి ప్రచురించే అవకాశాన్ని కల్పించినందుకు వారికి మా హృదయ పూర్వకమైన అభివందనాలను సమర్పించుకుంటున్నాము. యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి తమ ఆశీరమృతాన్ని అందిస్తున్న శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారికి మా ధన్యవాదాలు.

ముద్రణకి అవసరం అయిన తెల్లకాగితాన్ని సరసమైన ధరకు అందించి సహకరించిన భారతప్రభుత్వము వారికి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పాఠ్యపుస్తక ముద్రణాలయాధిపతులకు మా కృతజ్ఞతలు.

ముఖ చిత్రాన్ని అందంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రముఖ చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజు గారికి మా ధన్యవాదాలు.

పుస్తకాన్ని అతి తక్కువ కాలంలో అందంగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్ గారికి, బ్లాకులను సకాలంలో అందించిన శ్రీ అశోక్‌గారికి, ముఖ చిత్రాన్ని ముచ్చటగా, రంగులతో ముద్రించిన గీతా ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ బోసుగారికి మా కృతజ్ఞతలు.

భాషా బంధువులు యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని ప్రోత్సహిస్తూనే ఉంటారని ఆకాంక్షిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు : యువభారతి

# అవతరణిక

- కరుణశ్రీ -

చదువుతున్న కొద్దీ చవులూరించే ఉత్తమ మహాప్రబంధం ఉత్తర రామాయణం. నా చిన్నతనంలో బమ్మెర పోతరాజు గారి భాగవతంతోపాటు కంకంటి పాపరాజుగారి ఉత్తర రామాయణం కూడా ఉండేది మా యింట్లో. అప్పటి నుండీ ఉత్తర రామాయణం చదువుతూ ఉండటంవల్ల అందులోని సరళ గంభీరమైన శైలీసౌభాగ్యానికీ, ప్రసన్నమధురమైన భావరామణీయకానికీ నా మనస్సులో పాపరాజు గారి పట్ల ప్రత్యేకప్రతిపత్తి పాదుకట్టుకొంది. ఆ గౌరవ భావం ఇటీవల యువభారతి అధినేతలు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారు ''కంకంటి కవితావైభవం'' వ్రాయమని కోరటంవల్ల ఇప్పుడు ఇక్కడ ఈ విధంగా ఫలావస్థ నందుకొన్నది.

పాపరాజు పదిహేడవ శతాబ్దికి చెందిన మహాకవి. నెల్లూరు మండలంలోని ''ప్రళయకావేరి'' ఆయన నివాసస్థానం. ఆశ్వాసాంత గద్యాన్ని అనుసరించి ఆయన ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. ఆపస్తంబ సూత్రుడు. శ్రీవత్స సగోత్రుడు. నరసమాంబా అప్పయామాత్యుల పుత్రుడు. మదనగోపాలస్వామిభక్తుడు. చతుర్విధ కవితా నిపుణుడు. వివిధ విద్వజ్జనపరివేష్టితుడు. రాజయోగ సామ్రాజ్య లక్ష్మీ విలాస ధురంధరుడు. స్తవనీయ నయకళాయుగంధరుడు. బంధుర మనీషావిశేషుడు. అగణిత గణితశాస్త్ర రత్నాకరుడు. కంకంటి వంశ పయః పారావార పరిపూర్ణ సుధాకరుడు.

''విష్ణుమాయా విలాసం'' అనే విశిష్ట యక్షగానం, ''ఉత్తర రామాయణం'' అనే ఉత్తమ ప్రబంధం పాపరాజు గారు మనకు ప్రసాదించిన రెండు చక్కని గ్రంథాలు

''సమీర కుమార విజయ'' నిర్మాత పుష్పగిరి తిమ్మనా, ''ద్విపద భాగవత'' కర్త చేకుమళ్ల రంగశాయీ, ''ద్విపద విష్ణుమాయా విలాస'' రచయిత కంకంటి నరసింహయ్యా, ''దశావతార చరిత్ర'' కారుడు ధరణిదేవుల రామయ్యా పాపరాజుకు సమకాలికులైన కవిపుంగవులు. వీరిలో నరసింహయ్య పాపరాజుకు

తమ్ముడు. పుష్పగిరి తిమ్మన్న పాపరాజుకు ఆప్తమిత్రుడు. ''కిరీటికి శౌరితోడైన యటుల యమ్మహాకవి సాహాయ్య మాచరింప'' పాపరాజు ఉత్తర రామాయణ గ్రంథం రచించాడు.

ఉత్తర రామాయణం వ్రాయటానికి ప్రధాన కారణాలను పాపరాజు ఇట్లా వివరించాడు -

''పరమ శ్రావ్య, మఘవ్యయామిత కథాభవ్యంబు, దీవ్యత్సుధీ
పరిషత్సంతత సేవ్య, మబ్జభవ సంభావ్యంబునై మించు ను
త్తర రామాయణ కావ్యమున్ మృదువచోధారార్థ సందర్భని
ర్భర తంత్రదసముల్ రహింప రచియింపం బూనితిన్ వేడుకన్.''
''మానక కర్మభూమి పయి మానుషదేహముతో హితాహిత
జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జాని కథల్ రచింపక యసత్కథ లెన్ని రచించె నేనియున్
వాని వివేక మేమిటికి ? వాని కవిత్వమహత్వ మేటికిన్ ?''
''ఇహపర సాధకం బన రహించు ప్రబంధ మొనర్ప శ్రీ రఘూ
ద్వహుని చరిత్రమున్ దొరకె ...''
''రాఘవేశ్వరు చారిత్రము లెంచ ఔన్నిగతులన్ వర్ణించినం గ్రాలదే ?''
''పుణ్యాకరమైన రాముకథ హైన్యము మాన్పదె యెట్టివారికిన్ ?''

తన ప్రథమ గ్రంథమైన విష్ణుమాయా విలాసాన్ని ఇష్టదైవమైన మదన గోపాలస్వామికి అంకితం ఇచ్చాడు పాపరాజు. దానితో పాపరాజు కవిత్వం మీద చెప్పలేనంత మక్కువ ఏర్పడ్డ అయింది మదన గోపాలుడికి. అందుకే ''మేము నీ సుధానుసారి వాక్యాలఁ జొక్కి యున్నార మనఘ !'' అనీ ''వత్స ! నీ ప్రబంధమ్ము మదంకితమ్ముగ నొనర్పఁ గృతార్థుఁడ వయ్యెదు'' అని పాపరాజుకు స్వప్నంలో సాక్షాత్కరించిన మదనగోపాలుడు సెలవిచ్చి ఉత్తర రామాయణాన్ని కూడా అడిగి అంకితంగా అందుకొన్నాడు.

సంస్కృతంలో వాల్మీకి మహర్షి కృతమైన శ్రీమద్రామాయణంలో నాలుగువేల నూటపది శ్లోకాలతో ఉన్న ఉత్తర కాండను తిక్కన మహాకవి పన్నెండు వందల ఎనభై పద్యాలతో పది ఆశ్వాసాల ప్రబంధంగా ప్రపంచనం చేశాడు.

కథా కథన కౌశలానికీ, సంభాషణ చాతుర్యానికీ, రసపోషణ నైపుణ్యానికీ, శైలీనైగనిగ్యానికీ, అలంకార సమలంకరణానికీ, వర్ణనా వైదగ్ధ్యానికీ, చమత్కార చారుత్వానికీ, నుడికారపు విన్నాణానికీ ఆటపట్టైన మధురప్రబంధం ఉత్తర రామాయణం.

ఈ ప్రబంధంలో పూర్వ రామాయణ కథ, శ్రీరామ పట్టాభిషేకం, అగస్త్యాదుల ఆగమనం, విశ్రవోబ్రహ్మ వృత్తాంతం, మాల్యవదాదుల చరిత్ర, రావణ కుంభకర్ణ విభీషణుల జననం, తపస్సు, వివాహం, రావణ కుబేరుల యుద్ధం, రావణ నందీశ్వరుల సంవాదం, పరమ శివునిచే రావణ గర్వభంజనం, వేదవతీ రావణుల సంభాషణం, కార్తవీర్యుని చేతిలో రావణ పరాజయం, వాలివల్ల రావణ పరాభవం, రంభా రావణ సంవాదం, నలకూబర శాపం, మేఘనాధుని వీరత్వం, హనుమంతుని వృత్తాంతం, సీతా రాముల ఉద్యానవన విహారం, పౌరుల నిందావాక్యాలు, గూఢచారి భద్రుని నివేదనం, సీతా పరిత్యాగం, వాల్మీకి సమాదరణం, లవణాసుర సంహారం, శంబూక వధ, ఇలోపాఖ్యానం, రాముని అశ్వమేథం, కుశలవుల రామాయణ గానం, జానకీ శపథం, సీతా రసాతల గమనం, కుశలవ పట్టాభిషేకం, శ్రీరాముని అవతార సమాప్తి మొదలైన ఘట్టాలు ప్రకృష్టమైన ప్రతిభా పాండిత్యాలతో సర్వాంగ సుందరంగా నిర్వహించబడ్డాయి.

కంకంటి వారి ఉత్తర రామాయణానికి తెలుగుదేశంలో కావలసి నంత గౌరవం ఉన్నది. భారత భాగవత రామాయణాల లాగా పల్లెల్లో పట్టణాల్లో ఉత్తర రామాయణాన్ని చదువుకొనీ పురాణం చెప్పించుకొనీ ఆనందించే రసజ్ఞు లున్నారు. ఉత్తుంగ గంగా తరంగిణిలాగా పొంగిప్రవహించే ప్రసన్నగంభీరమైన శైలిలోనే కాకుండా పోతన్నగారికీ కంకంటివారికీ కృతి నిర్మాణంలో కూడా పోలికలున్నాయి. ఇద్దరికీ ఇష్టదైవాలు సాక్షాత్కరించి కావ్యనిర్మాణానికి ప్రోత్సాహ మిచ్చారు. కృతిని తమకే అంకిత మివ్వమని అర్థించారు. అయితే బమ్మెర వారికి రాముడు ప్రత్యక్షమై కృష్ణుని చరిత్రయైన భాగవతాన్ని తనకు అంకిత మివ్వమని అడిగితే కంకంటి వారికి కృష్ణుడు సాక్షాత్కరించి రామకథను అంకిత మివ్వమని కోరాడు.

ఉత్తర రామాయణంలోని ఆరవ అశ్వాసంలో ఈ క్రింది పద్యం ఉనద్ని—

''మృదు పాకంబు, రసస్థితి,
పదగుంభన గల స్వకృత ప్రపద్యశతంబుల్
చదివి యుపశ్లోకించిరి
మొదల కవుల్ భానువంశముఖ్యుని గుణముల్.''

సీతా సమేతంగా కొలువు తీర్చిన శ్రీరాముణ్ణి అయోధ్యలోని కవులు మునుముందుగా సంస్తుతించారన్నమాట, పై పద్యంలో మృదుపద విన్యాసమూ, అర్థ సందర్భమూ, రస సంపదా మొదలైన కవితాగుణాలు స్ఫురించటమే కాకుండా కవికి కల ఆత్మగౌరవం కూడా అభివ్యక్త మౌతున్నది.

కంకంటి వారి క్రాంత దర్శనానికి ఈ క్రింది పద్య పంక్తులు నిదర్శనాలు-

''ఒద్ద సేవలు చేయుచున్న ఛాయాదేవి
భీతిల్లి కరములు పిసికి కొనఁగ'' (5.103)
''యాజకుల్ వహ్ని హవ్యములు వ్రేల్వఁగఁ జాచు
హస్తముల్ సాచిన యట్టులుండె'' (5.113)
''తిలకంబు దిద్ది దిద్దితి చూడు మను రమా
సుదతి చెక్కుల నీడఁ జూచువాని'' (1.319)

ఈ కవి చంద్రుని కల్పనా శిల్పానికి ఈ బంతులు మేలుబంతులు-

''తిరుగు నొక్కొక్క చోటఁ జరణాబ్జములు సోకి
మహి యెల్ల మెట్టతామరలు గాగ'' (7.445)
''పాట పాడుదు రొక్కచోట మోడులు పల్ల
వించి కోయిలలకు విందు సేయ'' (1.170)

ఈ కవీంద్రుని ధారాశుద్ధికి ఈ క్రింది పద్యాలు చిత్తగించండి -

''అకృతాశ్లేష మవీక్షితానన మయుక్తాలాప మవ్యంజిత
భ్రుకుటీక ప్రణయం బకల్పిత సకృత్పుంభావ మవ్యక్తబం
ధకళామర్మ మలబ్ధకూజిత మసందష్టాధరం బయ్యు దై
త్యకులేంద్రున్ గరఁగించె దాని రత మాహా! వాని మేలెట్టిదో?'' (4.218)
''జహదస్త్రంబు లురత్తురంగముఁ బతచ్ఛత్రధ్వజంబున్ క్షిప
ద్బహుశీర్షంబు నటత్కబంధము గళద్రక్తంబు ధావద్భటం
బు హసద్భూతము విస్రవచ్ఛమపయఃపూరంబునై యిందిరా
గృహిచే శత్రుబలంబు పెంపుసెడి పాటెన్ దక్షిణాశగతిన్.'' (2.86)

కవిగారి ముచ్చటైన అచ్చతెలుగు నుడికారపు సొంపులకు మచ్చు తునుక లీ పంక్తులు -

తెలివియో చేరలంతేసి కన్నులదాని
మొలకనవ్వుల ముద్దుమోవిదాని

వెలయు సందెడు తలవెంద్రుకల్ కలదాని
పసమించు నెలవంక నొసలిదాని" (2.129)

"జాళువా మేలి పసిండి బొమ్మ చనుమిట్టలకున్ దెవిచల్వ పైరిణీ
చేల చెఱంగులై యచటఁ జెల్వగు వేలుపుటేటి పెందెరల్" (1.57)

పాపరాజు గారి కవితాకుమారి పదవిన్యాస సంపదలు గమనించండి -

"ఆతపమునందె నిలిచి మహాతపముఁ లొనర్చె" (1.96)

"ఆశల జయించి వెలయు భూమీశు లిల
ఆశలు జయించి తపము సేయంగ దొడఁగె" (1.207)

"వర్ణి నిధానమ! ఈ పగ
వర్ణిని మత్పుత్రి దేవవర్ణిని యనఁగా" (1.211)

"సదాగతియ సదా గతి యని" (5.93)

"శ్రీరామ లీల మీఱెడు శ్రీరామవధూటి" (6.298)

"దశముఖుఁడు యుద్ధ చలిత త్రిదశముఖుండు" (1.113)

"పగతుని యనుజు సమీపో
పగతుని దయఁ బ్రోచి" (1.114)

"అహరహంబును విహరించె మిహిరకులుఁడు" (6.173)

"రఘు" శబ్దమంటే కంకంటి కవి పొంగి పులకించిపోతాడు. రాముణ్ణి రఘు శబ్దంతో విశేషించటం పాపరాజు గారికి ఎంతో యిష్టం. కావ్యం నిండా రఘుపతి - రఘువర - రఘువీర - రఘుభర్త - రఘునాథ - రఘురామ - రఘునందన - రఘుప్రభు - రఘుస్వామి - రఘుగ్రామణి - రఘూత్తమ - రఘూద్వహ - రఘువంశ స్వామి - రఘుకుల గ్రామణి - రఘువీర శేఖర - శ్రీరఘు వీరశేఖర - రఘువంశాంబోధి చంద్ర - రఘుకుల క్షీరాబ్ధి పూర్ణేందు - రఘుకుల తిలక - రఘువంశ వల్లభ - రఘుప్రవర ఇత్యాది శబ్దాలు కోకొల్లలుగా శ్రీరామ చంద్రునికి విశేషణాలై విరాజిల్లుతున్నాయి. రాఘవ శబ్దం గ్రంథంలో 23 పర్యాయాలూ, రఘువీర శబ్దం 17 పర్యాయాలూ, రఘురామ శబ్దం 14 పర్యాయాలూ, రఘూద్వహ శబ్దం 8 పర్యాయాలూ, రాఘవేశ్వర శబ్దం 5 పర్యాయాలు ప్రయుక్తమైనాయి. ఈ విధంగా సుమారు 150 మార్లు రఘు శబ్దం గోచరిస్తుంది.

సమకాలిక కవులలో ఉత్తర రామాయణం పాపరాజుకు ప్రత్యేక ప్రతిష్ఠను సముపార్జించి పెట్టింది. ఇక స్థాలీపులాకన్యాయంగా ఉత్తర రామాయణ రత్నాకరంలోని రమ్యతర రత్నాలను కొన్నింటిని తీసికొని కంకటి వారి కవిత్వ కమ్రతను నమ్రతతో పరిశీలిద్దాం.

# కంకంటి కవితా వైభవం

## 1

*"వనితరో ! వెండికొండ నెలవంకలు పెక్కు వహించెఁ జూచితే"*
*యని సరసోక్తిఁ దాననిన నచ్చపు గందపుఁబూఁత గుబ్బ జా*
*ఱిన నునుఁబైఁటకొంగు సవరించుచు నవ్విన గౌరిఁ గౌఁగిటన్*
*దనిపెడు చంద్రశేఖరుఁ డుదారకృపన్ మముఁ బ్రోచుఁగావుతన్.*
(1-3)

పార్వతీ పరమేశ్వరులు ఏకాంతంగా కైలాసంలో సరసాలాడుకుంటూ కూర్చున్నారు. పార్వతి పరమశివుని జటాజూటంలో చెదరిన చంద్రరేఖను చక్క దిద్దుతూఉంది. అలా చేతులు చాచి చక్కదిద్దటంలో ఆమె పైటచెరగు కొంచెం జారింది. పరమేశ్వరుని చూపులు ప్రస్తాంశుకమైన సర్వమంగళ వక్షస్థలం మీద ప్రసరించాయి.

వెంటనే శివుడు పార్వతితో ''సుందరీ! చూడు చూడు! ఇదిగో వెండికొండ ఎన్ని నెలవంకలను ధరించిందో చూడు!''అని సాకూతంగా అన్నాడు.పరమశివుని పరిహాసంలోని పరమార్థం పసికట్టిన పర్వత రాజకుమారి నవ్వుతూ మంచిగంధం పూతతో మరింత తెల్లనైన తన స్తనమండలం మీదినుంచి జారిన పైట సవరించుకొన్నది. మందహాస మధురాననయైన హైమవతిని స్వామి ప్రేమతో గాఢాలింగనం చేసుకొన్నాడు. అటువంటి రసజ్ఞశేఖరుడైన చంద్రశేఖరుడు అత్యంత దాక్షిణ్యంతో నిత్యమూ మమ్ము రక్షించాలని కవి ఆకాంక్షిస్తున్నాడు.

'నెలవంకలు' అంటే చంద్రరేఖలు అనే కాకుండా నఖక్షతములు అని కూడా అర్థం ఉన్నది. వనితా వక్షోజాలకూ గిరిశిఖరాలకూ సాదృశ్యం సహృదయ సమ్మతం. అసలే ఆమె గౌరి (తెల్లనిది). అందులో స్వచ్ఛమైన చందనం పూసుకొన్నది. అందుకనే నఖక్షతాలతో కూడిన కుచాన్ని చూచి ''వెండికొండ పెక్కు నెలవంకలను ధరించిందే''అన్నాడు స్వామి-పాపం తనకేమి తెలియనట్లు. తాను ఒక్క నెలవంక ధరించాడు.వెండికొండ పెక్కు నెలవంకలను ధరించడం విశేషం. 'వనితరా' అన్న సంబోధన సముచితంగా ఉన్నది. అత్యంతమైన అనురాగంతో నిండిన స్త్రీని 'వనిత' అంటారు. ''వనితా జనితాత్యర్థానురాగాయాం'' అమరం. నాయిక స్వాధీనపతిక. నాయకుడు అనుకూలుడు. ''నెలవం

కలు పెక్కు ధరించె'' అనటం వల్ల శృంగార రసధ్వని. ''చంద్రశేఖరుడు'' (చల్లని స్వామి) అన్న సాభిప్రాయ విశేష్యం వల్ల పరికరాంకురాలంకారం.

# 2

''ఊరక చుట్టుకొన్నఁ గమలోత్పల పంక్తులు వాడునంచునో
యేఱును గూర్చి చుట్టితివి ! యెంతటి జాణవు ! మేలు మేలు ! నీ
నేరుపు మెచ్చవచ్చు''నని నిచ్చలు మచ్చిక శంభుఁగేరు నీ
హార గిరీంద్రకన్యక దయామతిఁ గోర్కెలు మా కొసంగుతన్.

(1-4)

పార్వతి పరమేశ్వరునితో పరిహాసమాడుతున్నది - ''ఏమి స్వామీ! కమలాలూ కలువలూ పొడిపొడిగా చుట్టుకుంటే వాడి వత్తలై పోతాయనే భయంతో కాబోలు తడితడిగా ఏటితో కూర్చి చుట్టుకున్నావు. మేలుమేలు. ఏలిన వారి నేర్పరితనం ఎంతైనా మెచ్చుకోవచ్చు.''

ఈ విధంగా మాటిమాటికీ మచ్చికతో శంకరుని మేలమాడుతున్న శైల బాల దయామయ హృదయంతో మా కోర్కెలు చేకూర్చుగాక అంటున్నాడు కవి.

హరుడు గంగాధరుడు. గంగ కమలాలనూ, కలువలనూ కలిగి ఉండటం కవి సమయం. పరమేశ్వరుడు గౌరమ్మకి అర్ధాంగం ఇచ్చాడు. గంగమ్మను నెత్తినెక్కించుకున్నాడు. గౌరికి ఈ వ్యవహారం ఏమాత్రం నచ్చలేదు. ఐతే ఏమంటుంది! ఆయన పరమేశ్వరుడాయె !

పైకి గంగానదిలా కన్పించుతున్నా ఆమె నిజస్వరూపం నిత్యం గౌరికి దర్శనమవుతూనే ఉన్నది. నీళ్లలో ఉన్నవి కమలాలూ, కలువలూ అని ఎంత సరిపెట్టుకున్నా వాస్తవానికి అవి గంగమ్మ ముఖమూ, కనులూ, వీక్షణ పరం పరలూ అని గౌరికి బాగా తెలుసు. అందుకనే ఆమె ఏమీ ఎరుగనట్లు ''కమ లోత్పల పంక్తులు వాడునంచునో యేఱును గూర్చి చుట్టితివి...మేలు మేలు''అని మేలమాడసాగింది. ఇది ఒకనాటి మేలం కాదు. నిత్యమూ జరిగే మేళమే.

'నీహార గిరీంద్ర కన్యక' హిమవంతుని ముద్దులకూతురు. చల్లనివాని బిడ్డ చల్లగానే ఉంటుంది. అలంకారం పరికరాంకురం. 'స్వామీ! నీవు ఎన్ని వేషాలు వేసినా నీ శిరస్సు మీద ఉన్నది నా సపత్నియైన గంగ అన్న సంగతి

నాకు తెలుసు'నని పరమార్థం. నన్ను ప్రక్కన ఉంచుకొనే యింత మోసమా? అని ధ్వని. నాయిక కలహాంతరిత. నాయకుడు దక్షిణుడు.

# 3

*ధరణీభృన్మణి మౌళిప ర్తనములం దర్శించెంది, యార్యో క్తిపై*
*ఖరి ప్రాపించి, యహీన విస్ఫురదలంకారా ప్తి శోభిల్లి, భూ*
*రిరసాటూఢిఁ జెలంగి, యర్థవరమైత్రిం జొక్కి మేటౌ కవీ*
*శ్వారులం గొల్చెద సన్మనోహర కళాచంచత్ప్రభావాఢ్యులన్.*

(1. 10)

ఇది చాలా గొప్ప పద్యం. పాపరాజు గారి పాండిత్యానికి మచ్చుతునక. ఈ పద్యంలో కవిగారు కవీశ్వరులకు కైమోడ్పు సంధిస్తున్నారు.

కవీశ్వరులంటే మహారాజులు సైతం తల మీది కెక్కించుకొని గౌరవింప దగిన వారు. ఆర్యుల వచోవైఖరుల నవలంబించేవారు. విశేషంగా విరాజిల్లే అలంకారాలతో ప్రకాశించేవారు. గొప్ప రస సంపదతో పెంపొందేవారు. రమణీయమైన అర్థవైభవంతో పరవశించి ఆతిశయించేవారు. సహృదయ హృదయంగమైన కవితాకళాకలాపాలతో ప్రశస్తులైనవారు. అటువంటి కవీశ్వరులను సేవిస్తున్నాను.

ఇక్కడ ఒక చమత్కారం ఉంది. కవీశ్వరులంటే కవిశ్రేష్ఠులని షష్ఠీతత్పురుష సమాసం చెప్పుకొని పై అర్థం సాధించాం. కవి + ఈశ్వరుడు అని ద్వంద్వ సమాసం చేసుకొనే పక్షంలో పద్యంలో ఉన్న పై విశేషణాలన్నీ ఈశ్వరునికి కూడా సమన్వయింపవలసి ఉంటుంది.

శివుడు 'ధరణీభృన్మణి'. అంటే పర్వతశ్రేష్ఠమైన – కైలాసశిఖరంపైన వర్తించేవాడు. 'ఆర్య' అంటే పార్వతీదేవి – వచోవైఖరిని ప్రాపించినవాడు. 'అహీన' అంటే సర్పరాజైన-ఆదిశేషుడే అలంకారంగా అలరారేవాడు. 'భూరిరసా' అంటే (త్రిపురాసుర సంహార సమయంలో రథంగా చేసుకొన్న) మహీమండలాన్ని- అధిరోహించినవాడు. 'అర్థవర' అంటే ధనపతియైన – కుబేరునిమైత్రితో ఆనందించేవాడు. 'సత్' అంటే నక్షత్రం. 'సన్మనోహరు' డంటే తారానాథుడైన చంద్రుడు. చంద్రకళా కలాపంతో కూడి మహాప్రభావసంపన్నుడైనవాడు. శ్లిష్టమైన "కవీశ్వర" శబ్దానికి తగినట్లు కవికీ ఈశ్వరునికీ సరిపోయే విశేషణాలు ఏర్చి కూర్చి తీర్చి దిద్దటంవల్ల ఇది శ్లేషాలంకారం.

# 4

"వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యంబై తగం జేసె ను
త్తర రామాయణ, మందుపై మఱి ప్రబంధంబూని నిర్మించుటే
సరసత్వం"బని ప్రాజ్ఞులార ! నిరసించంబోకుఁడీ, రాఘవే
శ్వరు చారిత్రము లెంద ఱెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే !
(1.14)

"తొలిసారిగా మహానుభావుడైన తిక్కనగారు ఉత్తర రామాయణాన్ని నిర్వచన కావ్యంగా నిర్మించనే నిర్మించారు. మళ్ళీ ఆ కథనే మీరు ప్రబంధంగా నిబంధించటం ఏమంత సరసమైన కార్యం !" అని ప్రాజ్ఞులు నిరసిస్తారేమో ననే సందేహంతో కంకంటి కవి ముందుగానే తన ప్రయత్నాన్ని సమర్థించు కుంటున్నాడు – రఘువంశ తిలకమైన రామచంద్రుని చరిత్రం ఎంతమంది కవులు ఎన్నిరీతుల అభివర్ణించినా అది అత్యంత మనోహరంగా నిత్యనూతనంగా విరాజిల్లుతూనే ఉంటుంది గదా ! అంటున్నాడు.

రాఘవ శబ్దంచేత రాముని వంశగౌరవమూ, ఈశ్వర శబ్దం చేత వైభవ ప్రాభావాలూ ధ్వనిస్తున్నాయి. తిక్కన్నగారు రామకథను కావ్యంగా రచిస్తే నేను వర్ణనప్రధానమైన ప్రబంధంగా నిర్మిస్తున్నానని కూడా కవి సూచిస్తున్నాడు. శ్రీరామచంద్రుని వంటి ఆదర్శనాయకుడు ఎక్కడా మరొక్కడు లభింపడు. కనుక నా యత్నం సముచితమే కాని అనుచితం కాదని పరమార్థం. ఇచ్చట తిక్కన్నగారి ఈ క్రింది అభిప్రాయం అనుసంధేయం–

"ఎత్తఱి నైనను ధీరోదాత్తనృపోత్తముఁడు రామధరణీ పతి స
ద్వృత్తము సంభావ్యమగుట నుత్తరరామాయణోక్తియుక్తుఁడ
నైతిన్." (ని. ఉ. రా. 1. 11)

అంతేకాదు. రామకథ వ్రాయని కవిత్వం వ్యర్థం అంటాడు పాప రాజుగారు–

"............చారు కవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథలెన్ని రచించె నేనియున్
వాని వివేక మేమిటికి? వాని కవిత్వమహత్త్వ మేటికిన్?" (1.15)

అన్నది కంకంటి వారి సిద్ధాంతం. అర్థాంతరన్యాసాలంకారం.

# 5

*కాంచనగర్భ శంకరముఖ త్రిదశేంద్రులు ప్రౌఢరీతిఁ గీ*
*ర్తించిన మెప్పుతో వినని కృష్ణుఁడు మత్కృతి కీర్తనం బ్రహ*
*ర్షించి వినున్, స్వకీయకృపచే విలసిల్లెడు వాక్కులౌటఁ; దా*
*ర్పించిన చిల్కపల్కు విని ప్రీతి వహింపకయుందురే దొరల్!*

(1.42)

బ్రహ్మ, శివుడు ఇత్యాది ఆదిత్యులు ఎన్నెన్నో విధాల సన్నుతిస్తున్నా ఆ విన్నపాలు వీనులారా విని మెచ్చుకోని కృష్ణప్రభువు నా కవితాకుమారి జిలిబిలి పలుకుల్ని ఆనందంతో ఆకర్ణిస్తాడు. ఇందులో సందేహం లేదు. ఎందుకంటే ఆ పలుకులు పలికించింది ఆయన అనుగ్రహమే కావటం వల్ల. లోకంలో అభిజ్ఞులైనవారు చిలుకను పెంచి మంచి మాటలు నేర్పుతారు. తాము నేర్పిన పలుకులే ఆ చిలుక పలుకుతుంటే ఆలకించి ఆనందిస్తుంటారు. అలాగే నాకృతి, ఆకృతిలోనున్న స్తోత్రం నా ప్రభువుకు అవశ్యం అభిమాన పాత్ర మవుతుందనటంలో ఏమాత్రం అనుమానం లేదంటారు కంకంటివారు.

"పలికెడిది భాగవత మట పలికించెడు వాఁడు రామభద్రుండఁట" అన్న బమ్మెరవారి ప్రగాఢ విశ్వాసమే పాపరాజుగారి పరమ విశ్వాసం. అలంకారం కావ్యలింగం-అర్థాంతరన్యాసం.

# 6

*వైదర్భీ విలసద్విలాసమునఁ జెల్వంబూని, సత్యోక్తి నెం*
*తే దీపించి కళిందజా జ్జ్వలరసా ప్తిన్ మించి, భద్రాత్మకం*
*బై, దివ్యధ్వన లక్షణాశ్రయ సమాఖ్యం గాంచు మత్కావ్య మా*
*హ్లాదం బిచ్చు; గ్రహింపఁ గృష్ణునకు నర్హంబే కదా యెయ్యెడన్.*

(1.43)

పాపరాజుగారు తన కావ్యాన్ని తన యిష్టదైవమైన మదన గోపాలస్వామికి అంకితంచేశారు. ఉదాత్తగుణధన్యయైన తన కృతి కన్య ఆ శ్రీకృష్ణునకు అతిశయమైన ఆనందాన్ని అందిస్తుందనీ, గోపాలుడు తన కృతి కన్యను తప్పకుండా స్వీకరిస్తాడనీ కవి తన విశ్వాసాన్ని ప్రకటిస్తున్నాడు ఈ పద్యంలో.

నా కావ్యం వైదర్భీరీతితో రాణిస్తున్నది. చక్కని ఉక్తులతో ప్రకాశిస్తున్నది. యమునానది వలె రసప్రసన్నమైనది. మంగళాత్మకమైనది. సకల లక్షణ సంపన్నమై వన్నెగాంచినది. అందువల్ల శ్రీకృష్ణునకు తప్పకుండా ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

చమత్కార మేమంటే పైన చెప్పిన విశేషణాల్లో శ్రీకృష్ణుని భార్యల పేర్లు కూడా సూచింపబడ్డాయి. వైదర్భి-రుక్మిణి, సత్య-సత్యభామ, కళిందజ-కాళింది, భద్ర, లక్షణ-వీరు శ్రీకృష్ణుని సతీ మణులు. వీరి సుగుణాల నన్నింటినీ పుణికి పుచ్చుకున్న నా కావ్యకన్యక కూడా రసికాగ్రేసరుడైన శ్రీకృష్ణునకు సర్వథా స్వీకారయోగ్య అవుతుందని పరమార్థం.

వైదర్భీరీతి, చక్కని ఉక్తిచమత్కారం, రసప్రసన్నత, విశ్వశ్రేయస్సు, లక్షణ సంపన్నత మున్నగు కవితాగుణాలకు తన కావ్యం కాణాచి అని ధ్వనింపజేశాడు ఇందులో కవి.

# 7

శ్రీరుక్మిణికి మకరికలు చెక్కుల వ్రాసి
సత్యకీల్జడఁ బూలసరులు చుట్టి
జాంబవతికిఁ గొప్పు చక్కఁగా నిడి మిత్ర
విందకుఁ బుక్కిటివీడె మొసఁగి
భద్ర సిబ్బెంపుగుబ్బల గందమలఁది సు
దంతకుఁ దిలకి మందముగ దిద్ది
కాళింది ముఖఘర్మకణము గోటను మీటి
లక్షణ యడుగుల లాక్షయుంచి
నీళకును మణిభూషణపాళిఁ దొడిగి
నవకువలయంబు రాధకర్ణమునఁ జెరివి
వెలఁదిమిన్నలు పదియాఱువేలు గొలువ
మించు కృష్ణుని శృంగార మెంచవశమె! (1.44)

ఈ పద్యం పాపరాజుగారి ప్రసన్న మధురమైన శైలీసౌభాగ్యానికి చక్కని ఉదాహరణం. ఈ సీసంలో కృతిపతియైన శ్రీకృష్ణుని శృంగారవైభవం ప్రతి

బింబిస్తున్నది. అష్టమహిషులే కాక ఇష్టమైన నీళారాధలు కూడ మాధవుని సౌంద ర్యారాధనకు అర్హత గడించుకున్నారు.

చెక్కిళ్లపై మకరికాపత్రాలు వ్రాయటం, వాలుజడకు పూలదండలు చుట్టటం, వీడిన కొప్పు సరిచేయడం, వీడెమీయటం, గంధ మలందటం, తిలకం దిద్దటం, స్వేదబిందువులు గోట మీటటం, పాదాలకు లాక్షపూయటం, మణిభూషణాలు అలంకరించటం, కలువపూవును కర్ణావతంసంగా అమర్చటం మున్నగునవి క్రమంగా శ్రీకృష్ణుడు తన ప్రియతమ నాయికలకు సమకూర్చిన సౌందర్య సమర్చనం.

కస్తూరి మొదలైన సుగంధద్రవ్యాలతో దిద్దితీర్చే మకరాకారరేఖలనే మకరికలనీ మకరికా పత్రాలనీ అంటారు.

అష్టభార్యలతో ఆనందించే అందాల కృష్ణుని శృంగారవర్ణన మంటే కంకంటివారి గంటానికి ఉత్కంఠ అధికం. అష్టమహిషులను అదే క్రమంలో గాథబంధంలో బంధించిన ప్రౌఢబంధురమైన ఈ పద్యం చిత్తగించండి -

*'వైదర్భీ' కుచపత్రభంగరచనావైయాత్యా! 'సత్యా'రతా*
*హ్లాదా! 'జాంబవతీ' కపోలముకుర ప్రాంచన్ముఖా! 'మిత్రవిం*
*ద' దంతచ్ఛదచుంబనాభిరత! 'భద్రా' ద్యూతలోలా! 'సుదం*
*తా' దృఙ్మోహన! 'భానుజా'ంకతలసుప్తా! 'లక్షణా' శ్లేషణా!*

(8. 347)

# 8

*ముసుఁగు వేసుక మూలమూల డాఁగిన దిశా*
*ధిపుల కిప్పుడు బయల్ దేరఁగలిగెఁ*
*గులుకు లొందక కొండగుహలఁ ద్రిమ్మరు వేల్పుఁ*
*జెలుల కిప్పుడు చెల్వుసేయఁగలిగె*
*జపతపంబులు మాని జడవృత్తిఁ దిరుగుమౌ*
*లకు నిప్పుడు నిష్ఠ సలుపఁగలిగె*
*ననదలై గతిమాలి చనిన ఖేచరుల కి*
*ప్పుడు విమానము లెక్కి పోవఁగలిగెఁ*
*బడగలెత్తక పడుకలఁబట్టి యడఁగి*
*యున్న ఫణిజాతి కిప్పుడు వన్నెగలిగెఁ*
*దశరథకుమారతిలక! నీ ధర్మమునను*
*దనుజవిభుఁ ద్రుంచి భయము మాన్పిన కతమున.* (1. 150)

రావణ వధానంతరం విజయాభిరాముడైన శ్రీరాముడు సీతాసమేతుడై అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడైనాడు. సింహాసనాసీనుడైన శ్రీ రామచంద్రుణ్ణి దర్శించి అభినందించటానికి అగస్త్యాది మహర్షులు వచ్చారు. రామభద్రుడు ''బంగరుకొండ నుండి దిగు బాలదివాకరు లీల'' సింహాసనం దిగి ఎదురేగి నమస్కరించి పూజించి కుశలం అడిగాడు. అప్పుడు అగస్త్యాదులు తమ ఆనందాన్ని ప్రకటిస్తూ పలికిన పద్యమిది.

దశరథనందనా ! నీ ధర్మాన విశ్వవిద్రావణుడైన రావణుణ్ణి మట్టుబెట్టి ముల్లోకాల భయం పోగొట్టావు. నీ దయవల్ల జగత్తుకు శాంతి సమకూరింది ముసుగులు వేసుకుని మూలమూలలా నక్కి దిక్కుమాలి ఉన్న దిక్పాలకులు ఇప్పుడు ఊపిరి పీల్చుకొని బయటికి రాగలిగారు మునులు నిష్ఠాగరిష్ఠులై నిర్విఘ్నంగా తపస్సులు చేసుకోగలిగారు. వేల్పులు విమానాలెక్కి విహరింపగలిగారు రాయిరప్పల సందున అణిగిపడిఉన్న ఫణిరాజులు మణికాంతులు ప్రసరించే తమ పడగలు పైకెత్తగలిగారు.

ఈ పద్యంలో 'నీ ధర్మమునను' అన్నమాటలో ఉన్నది చమత్కారం. ధర్మ శబ్దానికి పుణ్యం, విధి, విల్లు అనే అర్థాలున్నాయి.

"ఏదో నీ పుణ్యమా అంటూ ఆ రావణుణ్ణి సంహరించావు - నీ క్షాత్ర ధర్మాన్ని అనుసరించి దానవేంద్రుణ్ణి మట్టుపెట్టావు- నీ ధనుస్సు ఎక్కుపెట్టి కోదండరాముడవై క్రూర రాక్షసుణ్ణి కూల్చివేశావు - నీవు ధర్మస్వరూడవు- ''రామో విగ్రహవాన్ ధర్మః''. ధర్మ సంస్థాపనార్థం నీవు సంభవించావు. దుష్ట శిక్షణం శిష్టరక్షణం నీ ధర్మం. దాన్ని నీవు నిర్వర్తించావు.'' అనాథ అయిన ఈ జగతి ఇప్పుడు రాముని ధర్మాన సనాథ అయింది. అందుకనే 'దశరథకుమార తిలక, అన్న సార్థకమైన సంబోధనం.

ఈ సీసపద్యంలోని 1, 2, 4 పాదాలలో దిక్పాలకులనూ, దేవకాంతలనూ, ఖేచరులనూ పేర్కొనటంవల్లా, మూడవపాదంలో మౌనులను గూర్చి చెప్పటంవల్లా, గీతంలో నాగరాజులను గ్రహించటంవల్లా స్వర్గమర్త్య పాతాలలో రావణుడు ఆచరించిన అత్యాచారాలు అభివ్యక్తమవుతున్నాయి.

దిశాధిపతులు దిక్కు లేనివారై ముసుగులు కప్పుకొని మూలమూలల్లో దాక్కోటం మొదలైన వర్ణనలవల్ల రావణుని ప్రచండపరాక్రమం ధ్వనిస్తున్నది. ఈ ధ్వనివల్ల అంతటి పరాక్రమవంతుణ్ణి అంతంచేసిన శ్రీరాముని వీరత్వం వ్యంగ్యమవుతున్నది. దిశాధిపులు-వేల్పుచెలులు - మౌనులు - ఖేచరులు - ఈ శబ్దాలు సాభిప్రాయాలు. అలంకారం-పరికరం, స్వభావోక్తి, శ్లేష.

# 9

*"కీలాలం"బని నీరు గ్రోలు రహి సుక్కించెన్, "పలాశంబు"లం*
*చాలోకించుట మానెఁ బర్ణముల, "మధ్వాఖ్యం" బ్రవర్తింపఁగాఁ*
*జాలించెన్ విరిదేనె, "ఛాయ" దొరయం జన్నన్ రవిద్రోహదు*
*శ్శీలం బౌనని, రాక్షసత్రయి విసర్జించెం దరుచ్ఛాయయున్.* (1. 275)

మాల్యవంతుడు, సుమాలి, మాలి అనే ముగ్గురు రాక్షసరాజులు బ్రహ్మదేవుణ్ణి గూర్చి ఘోరంగా తపస్సు చేయసాగారు. వీరు రావణునికంటె పూర్వం లంకానగరాన్ని పరిపాలించినవారు. కఠోరనియమంతో కూడిన వారి తపశ్చర్యను కవి ఈ పద్యంలో హృద్యంగా వర్ణించాడు.

నిష్ఠుర తపోనిష్ఠాగరిష్ఠులైన ఆ రాక్షసశ్రేష్ఠులు 'కీలాల' మనే భావంతో జలం త్రాగటం మానేశారు. 'పలాశా'లనే భావంతో ఆకులను తినటం మానేశారు. 'మధు' వనే భావంతో పూదేనె గ్రోలటం మానేశారు.

'కీలాలం' అంటే జలమనీ, నెత్తురనీ అర్థముంది. 'పలాశాలు' అంటే ఆకులనీ మాంసాహారములనీ అర్థం. 'మధువు' అంటే మకరందమూ మద్యమూ అనే అర్థాలున్నాయి. రక్తమాంసాలూ మద్యమూ రాక్షసులకు అత్యంత ప్రియమైనవి. తమకు ఎంతో ఇష్టమైన రక్తమాంసమద్యాలను పరిత్యజించటమే కాకుండా నామమాత్రసాదృశ్యం గల జలపర్ణమకరందాలను సైతం వారు దూరంగా పరిహరించి కఠోరతపస్సు చేస్తున్నారని భావం. ఇంతేకాకుండా పరకాంతలను పరమాన్నంగా భావించి అనుభవించే ఆ రాక్షసులు సహజమైన ఆ భావానికి స్వస్తి చెప్పారు. తరుచ్ఛాయనుసైతం ఆశ్రయించటం మానేశారు. ఎందుకంటే సూర్యుని భార్యపేరు ఛాయ. ఛాయను యిస్తే ఆ సూర్యునికి ద్రోహం తలపెట్టినట్లు అవుతుందనే సందేహంతో. అన్నాహారాలు మాని నీరు కూడ త్రాగకుండా, మండుటెండలో తపస్సు చేస్తున్నారని పరమార్థం.

# 10

*తిలకంబు దిద్ది దిద్దితిఁ జూడుఁడను రమా*
*సుదతి చెక్కుల నీడఁ జూచువాని*
*మొనపంటి మడుపు వేఁడిన నీళ యొసఁగ నం*
*దుచుఁ జుఱుక్కున మోవి నొక్కువాని*
*నా చిన్నెలకును బిక్కని మొగం బటుపెట్టు*
*కొనిన భూసతి వేడుకొనెడు వాని*
*వారి యింతులకు మున్ వాదు తానె ఘటించి*
*నలిరేఁగి పోరాడు నవ్వువాని*
*నిచ్చఁ బరిపూర్ణ కాముఁడై హెచ్చువాని*
*నచ్యుతుని గాంచి మ్రొక్కి ''యింద్రాది సురులు*
*దేవ! యరుదెంచినా'' రంచుఁ దెలివినంత*
*''శ్రీఘ్రమునఁ దోడితె''మ్మని సెలవొసంగె.* (1.319)

జగత్కంటకులైన మాల్యవదాదుల బాధలు భరింపలేక ఇంద్రాది దేవతలు తమ కష్టాలు విష్ణుమూర్తితో మొరపెట్టుకోటానికి వైకుంఠానికి వెళ్ళారు. అంతఃపుర దౌవారిక దేవతల రాక విష్ణుదేవునకు చెప్పటానికి వెళ్ళింది. ఆ సమయంలో శ్రీ మహావిష్ణువు శ్రీదేవితో భూదేవితో నీళాదేవితో ఏకాంతంగా కొలువుదీరి ఉన్నాడు. ఆ సందర్భంలోని పద్యమిది.

శ్రీదేవి దేవదేవుని అలికఫలకాన తిలకం దిద్ది 'అద్దం చూచుకోండి' అన్నది. ఆయనగారు ఆమెగారి చెక్కుటద్దంలోనే తన ముఖతిలకాన్ని తిలకింప సాగాడు. ఆ చమత్కారానికి శ్రీదేవి చిరునవ్వు నవ్వింది. 'సుదతి' అన్న విశేషణం ఈ భావాన్ని సూచిస్తుంది. (సుదతి అంటే సుందరమైన దంతాలు కలది అని అర్థం. ఇందిర మందహాసం చేస్తేగాని సుందరమైన పలువరుస బయటపడదు.)

నీళాదేవిని మునిపంటి ఆకుమడుపు ఇమ్మని తానే వేడుకొని తీరా ఆమె అందించే సమయంలో ఆ చక్కనిచుక్క చిక్కనిమోవి చురుక్కున నొక్కాడు స్వామి. ఈ శృంగార చేష్టలన్నీ చూస్తున్న భూదేవికి కోపంవచ్చింది. ఆమె గిరుక్కున మొగం ప్రక్కకు త్రిప్పుకున్నది. స్వామి ఆమెను గడ్డంపుచ్చుకొని

బతిమాలుతున్నాడు. ముగ్గురు సవతులకూ తగాదాపెట్టి వాళ్ళు కీచులాడు కుంటుంటే నవ్వుతున్నాడు స్వామి. ఈ విధంగా దాక్షిణ్యపరిపూర్ణుడైన గోవిందుని సందర్శించి బృందారకుల రాక తెల్పింది ప్రతీహారి.

నాయిక నాయకుని ఫాలఫలకాన తిలకం దిద్దటం, అతడు అమె చెక్కుటద్దంలో నీడచూడటం లాంటి వర్ణనలు కంకంటి వారికి చాల యిష్టం. ''జాంబవతీకపోలముకుల ప్రాంచన్ముఖా !'' అంటాడు-ఒకచోట. పై సీసం వంటిదే కంకంటి వారిదే మనోహరమైన సీసం చిత్తగించండి—

*తిలకంబు దిద్దు ముద్దులగుమ్మ యద్దంపు*
*నిద్దంపుఁజెక్కుల నీడఁ గనుచు*
*అలరుదండలఁ జుట్టు చెలి లేనగవుఁ జూచి*
*యీ వింత పూదండ యేడదనుచు*
*కలపంబు పూయు తొయ్యలిమేని కమ్మవా*
*సనలు పైఁబొలయ మూర్కొని యలరుచు*
*కపురంపు విడెమిచ్చు కలికి ముచ్చట విన*
*వేడ్కయై మాటాడ వేఁడుకొనుచు.* (4-48)

# 11

*''పెక్కులు ప్రేల నేర్చినను ప్రేలవె ! నీ పశుబుద్ధి మాటలం*
*దక్కెనె! చక్కఁగా నెదిరిఁ దన్ను నెఱుంగ వటుండు; పుష్పకం*
*బిక్కడ నాఁగి మీ యధిపుఁ డింక సుఖంబున నుండుఁ గాఁదె !*
*యెక్కిన వెండికొండ నిదె యేఁ బెకలించి రజంబు సేసెదన్ !!''*
(3.77)

వరగర్వం చేత కన్నూమిన్నూ ఎరుగని రావణుడు అన్నగారైన కుబేరుణ్ణి జయించి అతని పుష్పకవిమానం అధిరోహించి ఆకాశమార్గాన అరుదెంచుతున్న సమయంలో ఆకస్మికంగా పుష్పకం ఆగిపోయింది. విమానం కదలకపోవటానికి కారణం ఏమా అని ఆలోచిస్తున్న లంకేశ్వరుని ముందు నందికేశ్వరుడు సాక్షాత్కరించి ''రావణా ! ఇది కైలాసం. మహాదేవుడు గౌరీదేవితో విహరిస్తున్నాడు. ఈ సమయంలో ఈ వెండి కొండను అతిక్రమించటం బ్రహ్మాదులక్కూడా వశం కాదు. వెనక్కు వెళ్ళిపో !'' అన్నాడు. ఆ మాటలకు గర్వాంధుడైన దశ

కంధరుడు వానరముఖుడైన నందిని పరిహసిస్తూ పకపక నవ్వాడు. నందీశ్వరుడు ఆగ్రహోదగ్రుడై "వానరులే నీ వంశాన్నీ, నీ వైభవాన్నీ నిర్మూలిస్తా"రని శపిస్తాడు. శప్తుడైన రావణుడు నందితో పలుకుతున్న ప్రగల్భోక్తులివి.

"ఓరీ! ఊరుకొన్న కొద్దీ నోరికి వచ్చినట్లు కారులు ప్రేలుతున్నావు నీవొక పశువువు. నీ పశుబుద్ధి ప్రకటించావు. అయినా నా గొప్పతనం నీకెట్లా తెలుస్తుంది? సరేలే! పుష్పకం అట్లాగే పడి ఉంటుందిలే! ఇక మీ దేవుడు కాంతతో ఏకాంతంగా ఎట్లా విహరిస్తాడో చూస్తాను. ఇదిగో ఇప్పుడే వెండికొండను పెళ్ళగించి పిండిపిండి చేస్తాను."

క్రుద్ధుడైన దశగ్రీవుని ఔద్ధత్యానికీ అహంకారానికీ ఈ పద్యం నిదర్శనం. "నీ పశుబుద్ధి" అన్నమాట నందిపట్ల అర్థవంతంగా ఉంది. పశువు మాటలతో వినదు. దెబ్బ తగిలితే గాని దానికి తెలివిరాదు. అందుకనే కొండ పిండిచేసి నీకు బుద్ధి చెబుతానంటాడు మదోద్ధతుడైన రావణుడు.

# 12

*ఇట్లు లదిమిన భుజశౌర్యం మెడలి, బడలి,*
*యడలి, యొడలి మదోద్వృత్తి నడలి, వాలి*
*కాలి పెనువ్రేలు దెమలించి కరము లెత్తు*
*కొన సమర్థత లేక రక్షోవిభుండు.* (3.84)

నందీశ్వరుని హితవాక్కులు లెక్కింపని దశగ్రీవుడు ఆగ్రహావేశంతో వింశతి హస్తాలతో వెండికొండను పెళ్ళగించాడు. కదలుతున్న కైలాసగిరిపై కాలు నిలుపలేక పార్వతి పరమేశ్వరుణ్ణి కౌగిలించుకొన్నది. లంకాధిపతి అహంకారాన్ని అణచివేయటానికి ఇందుశేఖరుడు మందహాసంతో ఎడమకాలి బొటన వ్రేలితో క్రిందికి అదిమేసరికి పాపం రావణుని ఇరవై చేతులూ వెండికొండ క్రింద ఇరుక్కుపోయాయి. అప్పటి దశగ్రీవుని దైన్యదశ ఈ తేటగీతిలో తేట తెల్లమవుతుంది.

ఎంత రక్షోవిభుడైతే మాత్రం ఏంలాభం! స్వామివారి వామపాదాంగుష్ఠాన్ని తెమలించి చేతులు పెకలించుకొనే సామర్థ్యం లేకపోయింది అతనికి. అందుకనే

భుజశౌర్య మెడలి బడలి సడలిపోయాడు రాక్షసరాజు. ఒక్కభుజంకాదు. ఇరవై భుజాలున్నాయి. అయితేనేం వాటిశక్తి ఉడిగిపోయింది.

అలంకారం యమకం. శూలి కాలి పెనువ్రేలు—వృత్త్యనుప్రాసం.

# 13

*ఆపన్నుండగు పంక్తికంఠుఁ డిది యౌనంచున్ లలాటేక్షణ*
*శ్రీపాదాంబుజముల్ మనోంబుజమునం జింతింపుచున్ వేదవి*
*ద్యాపాండిత్యము, సర్వశాస్త్ర కుశలత్వంబున్, మహా సాహితీ*
*నైపుణ్యంబును గానిపింపఁ బొగడెన్ గంగోర్మితుంగార్భటిన్.*
(3.90)

రావణుని చేతులు రజతగిరి క్రింద చిక్కుకొని పోయాయి. ఎంత గింజుకున్నా ఊడిరావటంలేదు. ఇదంతా కైలాసం కందుకంలాగా పైకెత్తి పరమేశ్వరుణ్ణి పరాభవించాలకున్న తన దురహంకారానికి ప్రతిఫలం అనుకున్నాడు పశ్చాత్తప్తుడైన దశకంఠుడు. మార్గాంతరం లేక మహేశ్వరుని పవిత్ర పాద పద్మాలు హృదయంలో పదిలపరచుకొని తన వేదపాండిత్యమూ, శాస్త్రవైదుష్యమూ, సాహిత్యసౌభాగ్యమూ ప్రకటిస్తూ ఉత్తుంగ గంగా తరంగిణి లాగా పొంగిపొరలే వచోవైభవంతో స్తోత్రం చేయసాగాడు స్వామిని.

ఆ స్వామి లలాటేక్షణుడు. ఆయన నెన్నుదుటి కన్ను మంటలు చిమ్ముతుంటుంది. పైగా స్వామికి కోపం కూడా వచ్చింది. ఆ కోపాన్ని చల్లపరచటానికనే ఉత్తుంగ గంగాతరంగార్భటితో స్తుతించటం. ఆయనవి శ్రీ పాదాంబుజాలు. భక్తులకు శ్రేయస్సు ప్రతిపాదించేవి. అందుకనే వాటిని ఎదలో పదిలపరచుకోటం.

రావణుడు బ్రహ్మసంతతివాడ. వేదవేత్త. సమస్త శాస్త్రనిష్ణాతుడు. సాహితీ సంపన్నుడు. కనుకనే గంగోర్మితుంగార్భటితో స్తుతింపగలిగాడు. ఒక కంఠంతో కాదు—పది కంఠాలతో. పంక్తికంఠుడు గాబామరి. కంకంటి కవీంద్రుని యోగ్యమైన శయ్యాసౌభాగ్యానికి ఈ పద్యం ఉదాహరణం.

# 14

*క్రమతోయార్ద్రకపోల, మంసగళదంచన్మాల్య, మామ్లానగా*
*త్ర, మసంవ్యాౣత కంచుకం, బలికమధ్యస్థాలకం, శానతా*
*స్య, ముదారోచ్ఛ్వసనాకులంబు నగు స్వాస్త్రైణంబుతో హైహయుం*
*డమరీయుక్తబలారి యట్లరిగె రేవాంభో విహారస్పృహన్.* (3.212)

రావణుడు కార్తవీర్యార్జునుణ్ణి జయించుదామని మాహిష్మతీ నగరానికి వెళ్ళాడు. ఆ సందర్భంలో తన రాణులతో రేవానదికి వెళ్తున్న కార్తవీర్యుణ్ణి వర్ణిస్తున్న పద్యమిది.

'స్త్రీణాం సమూహః స్త్రైణ' స్వస్త్రీ సమూహంతో కూడి రేవానదిలో జలక్రీడలాడబోయే కార్తవీర్యార్జునుడు సురసుందరీ సమేతుడై మందాకినికి పోయే మహేంద్రుడు లాగున్నాడు. 'బలారి' అంటే ఇంద్రుడు. బలుడనే బల వంతుడైన రాక్షసుణ్ణి మట్టు పెట్టినవాడని అర్థం. ఇక్కడ ఈ ఉపమానం వల్ల కార్త వీర్యుని మహాబలం ధ్వనిస్తున్నది. కార్తవీర్యార్జునుని అంతఃపుర కాంతలకు అమరాంగనలతో ఉపమానం చెప్పటం వల్ల వాళ్ళు అప్సరసల వంటి అంద చందాలు గలవారనీ ఎలజవ్వనులనీ వ్యక్త మౌతున్నది.

వనవిహారంతో అలసి సొలసిన అంతఃపుర కాంతల అందాన్ని సరస కోమల సమాస విన్యాసంతో కన్నులకు కట్టిస్తున్నాడు కంకంటి కవి ఘర్మ బిందువులు వారి కపోలాలపై నిండి ఉన్నాయి. తలలో ధరించిన పూలదండలు భుజాలమీదికి జారాయి. తనూలతలు వాడిపోయాయి. రవికలు ముడులు వీడి సడలిపోయాయి. ఫాలభాగాలపై నీలి ముంగురులు ముసురుకున్నాయి. ముఖాలు వినమ్రమాలైనాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అతిశయించాయి. అందుకనే రేవా నదీ జల విహార కుతూహలం.

# 15

*చరణాగ్రంబులఁ దిన్నగా నడిచి, పశ్చాద్భాగముం జేరి, యా*
*శరుఁడున్ మస్తము లోరఁజేసికొని, హస్తంబుల్ పయింజాఁచినన్*
*హరి దంతిన్ గ్రహియించునట్లు ప్రబలుం డవ్వాలి బల్మిందిటన్*
*శిరముల్ ప్రక్కలు బాహుపంక్తి లిఖికించెన్ బంధనత్వాతంబునన్*
(3.283)

రావణుడు మహాబలశాలియైన వాలి జోలికి పోయి పరాభవం పాలైన సందర్భమిది. దక్షిణ సముద్ర తీరంలో సంధ్య వార్చుకుంటున్న అక్షీణ పరాక్రమశాలి యైన వాలిని వెనుకపాటుగా సమీపించి, పొంచి, వంచించి సముద్రంలో త్రోసివెయ్యాలని నిశ్చయించుకున్నాడు లంకేశ్వరుడు.

మునికాళ్ళమీద చప్పుడు కాకుండా చల్లగా నడిచాడు. వెనుకవైపుకు చేరాడు. వాలికి కన్పించకుండా తన తలలు ఏటవాలుగా త్రిప్పుకున్నాడు. మెల్ల మెల్లగా చేతులు ముందుకు చాచాడు. రావణుని రాక ముందుగానే పసికట్టిన వాలి తన ప్రచండ శక్తి సామర్థ్యాలతో సింహం ఏనుగును పట్టినట్లు అతణ్ణి తన సందిట్లో బంధించాడు. రావసోడి పది శిరాలూ ఇరవై కరాలూ వాలి చంకల క్రింద చిక్కుపోయాయి. అలంకారం-ఉపమ, స్వభావోక్తి. సింహంతో ఔపమ్యం చెప్పటం వల్ల వాలి జవసత్వాలు వెల్లడవుతున్నవి. ఏనుగుతో పోల్చినందువల్ల రావణుని విగ్రహపుష్టి, బుద్ధి మాంద్యమూ వ్యక్తమౌతున్నవి.

# 16

*"చతురంభోధుల దైత్యుముంచిన భుజాశౌర్యాఢ్యు నవ్వాసవిన్*
*హతు గావించితి వొక్కతూపున ; సమిత్రామాత్య పుత్తంబుగాఁ*
*గృతవీర్యాత్మజుఁ ద్రుంచివైచిన త్రిలోకీవర్ణితున్ రేణుకా*
*సుతు నిర్జించితి వెంచ శక్యమె నినున్ ! క్షోణీసుతాధీశ్వరా ! "*
(3-298)

అగస్త్యమహర్షి రావణుని వీరవిహారాలు వర్ణించి చెప్పి రాముని పరాక్రమాతిశయాన్ని ప్రస్తుతిస్తున్నాడు పై పద్యంలో.

వైదేహీవల్లభా! విన్నావుగదా వీరాధివీరుడైన రావణుని శక్తిసామర్థ్యాలు. అటువంటి సాహసవంతుణ్ణి చతుస్సముద్రాలలో ముంచితేల్చిన మహాపరాక్రమాన్వితుని మహేంద్రసుతుని ఒక్క బాణంతో హతుని గావించావు. రాక్షసాధిపతి రావణుణ్ణిన్ని బంధించి పరాభవించిన అనివార్యశౌర్యుడు కార్తవీర్యుడు. వాని సహస్రకరాలను పరశువుతో నరకివేశాడు భార్గవ రాముడు. దుర్జయుడైన ఆ పరశురాముణ్ణి నిర్జించిన మహాశక్తిసంపన్నుడవు నీవు, స్వామీ! నీ సామర్థ్యం ఎంతటిదో ఎంచడం మాకు శక్యమా!

ఇంతపర్యంతం అగస్త్యమహర్షి రావణుని జైత్రయాత్రలు అభివర్ణించి అతడు కార్తవీర్యునికి, వాలికి లొంగిపోవటం వ్రాక్రుచ్చాడు. ఇప్పుడు అటువంటి అద్వితీయ పరాక్రమవంతులైన వాలి కార్తవీర్యుల భుజవిక్రంకంటె రాముని పరాక్రమం గొప్పదని సప్రమాణంగా నిరూపించాడు.

# 17

*'రతి' చన్నుమిట్టల రాణించు కస్తూరి*
*కావంకమునఁ దిలకంబు దిద్ది*
*'కేళిని' భ్రూయుగశ్రీలఁ బోలెడు నల్ల*
*చెఱకు సింగిణివిల్లు చే ధరించి*
*'మోహంపురాణి' క్రొమ్ముడి యెమ్మె కెనయైన*
*బలునారి పలుమాఱుఁ బట్టి దీటి*
*'లచ్చికోడలి' కన్నులకు దీటువచ్చు నీ*
*లోత్పల శరపంక్తు లొనరఁ దాల్చి*
*లలిత కలకంఠ కోలాహలంబు లెసఁగ*
*దశముకాని రెండుగెడలఁ గాదంబకోటి*
*గొల్వ రాచిల్క సాంబ్రాణిగుఱమెక్కి*
*దర్పకుఁడు పాంథజనులపై దండువెడలె.* (4.156)

గండుకోకిలల కోలాహలాలతో, రెండువైపులా కదలివచ్చే కలహంస కదుపుల కైవారాలతో మేలిజాతి రాచిల్కతేజీ నెక్కి విరహిజనులపై దండువెడలిన పుష్పకోదండుని వీరశృంగారమూర్తికిస్ఫూర్తిని సమకూర్చే వర్ణనమిది.

కందర్పుడు తన అందాలరాణి రతి సమున్నత స్తనమండలంపై కదంబించే కస్తూరీద్రవంతో ముద్దుముద్దుగా తిలకం దిద్దుకున్నాడు. తన ప్రేయసి భ్రూయుగళం సోయగాన్ని పుణికిపుచ్చుకున్న పుండ్రేక్షుకోదండాన్ని ముంగేల సింగారించాడు. తన ముద్దులగుమ్మ క్రొమ్ముడి నిగనిగలకు సాటివచ్చే మేటి ఎలదేటినారిని మాటిమాటికీ మ్రోగించాడు. తన వాల్గంటి కడకంటిచూపుల వంటి నల్లకలువతూపులను ధరించాడు - ఈ విధంగా జైత్రయాత్రకు వెడలిన జగదేక వీరుడైన మారునకు జయింపరాని దేమున్నది!

ఇందులో మన్మధుని అలంకారమూ విల్లూ అమ్ములూ నారీ-ప్రతిదానిలో రతి సౌందర్యమే ప్రతిబింబించటం గమనార్హం. ఇందువల్ల రతికీ రతిపతికీ గల అన్యోన్యానురాగం అవినాభావసంబంధం ధ్వనిస్తున్నవి.

# 18

*పలు తావుల్ వెదచల్లు తెమ్మెరలు పైపై డాయ, రేరాజు వె*
*న్నెల గాయన్, మధుపాళి మ్రోయఁ, గలకంఠీపాళి గూయన్, మరు*
*ల్లలనల్ గానముసేయ, నొంటి, నిశివేళన్, దోఁటలో, నైందవో*
*పలవేదిన్, వసియించు పాంథుని స్మరాపస్మారముల్ సేరవే!*

(4. 170)

స్వర్గాన్ని జయించాలని చతురంగబలాలతో జైత్రయాత్రసాగించిన రావణుడు మార్గమధ్యంలో ఒక తోటలో ఆగాడు. ఇంద్రునిపైకి దండెత్తిన దనుజేంద్రునిపై ఇప్పుడు మన్మధుడు దండెత్తాడు.

గుండెలు గుబగుబలాడించే కమ్మ తెమ్మెరలు వీస్తున్నాయి. గండు తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి. వెన్నెలలు విరబూస్తున్నాయి. కోకిలలు కూస్తున్నాయి. గంధర్వ కాంతల గానాలు వినవస్తున్నాయి. అర్ధరాత్రి. తోటలో ఉన్నాడు. పైగా చంద్రకాంతశిలా వేదికపై శయనించిఉన్నాడు.

అసలే రావణుడు. అందులో పరకాంతాపరాయణుడు. ఆమీద గర్వాంధుడు. ఆపైన కామాంధుడు. ఇప్పుడు ఏకాంతా చెంతలేని ఏకాంత పాంథుడు. ఎక్కుతుందంటే ఎక్కుదామరి పిచ్చి! మనస్సును రెచ్చగొట్టే మరుని పిచ్చి.

ఇందలి మలయ మారుతం - నిండు జాబిలి - పండువెన్నెల - తుమ్మెదలు - కోకిలలు-గంధర్వగానాలు రావణుని స్మరాపస్మారాన్ని రెచ్చగొట్టే ఉద్దీపన విభావాలు. 'పాంథ'శబ్దం పథిక వాచకం. విరహ సూచకం. డాయన్, కాయన్, మ్రోయన్, కూయన్, చేయన్ అనుక్రియలు మరుని దురాక్రమణాలను ధ్వనింపజేసే ప్రక్రియలు.

అలంకారం - సముచ్చయం.

2)

## 19

''పచ్చని కంకణమ్ములను భాసిలు డాపలికేల జాఱువా
కుచ్చెల కొంగుఁ దాల్చి, తళుకుందెలిచెక్కులు చెమ్మరింపఁగా,
హెచ్చు పిఱుందు భారము సహింపక నెన్నడ లింత కొంచఁగా,
నెచ్చట నుండి యెచ్చటికి నేఁగెడునో యిది యొంటి పాటునన్ ?''

(4.192)

అసలే కోతి! అందులో అది కల్లు త్రాగింది! ఆ మీద నిప్పు త్రొక్కింది! అంతలో తేలు కుట్టింది! అది చాలక పిచ్చెక్కింది! ఇక గంతులూ, గల్లంతులూ ఏం చెప్పాలి ?

కామోత్కంఠుడైన దశకంఠుని అదృష్టమో, దురదృష్టమో చెప్పలేము కాని ఆడబోయిన తీర్థం ఎదురయింది. అందంగా అలంకరించుకొని తన ప్రియుడైన నలకూబరుని ఇంటికి ఒంటరిగా వెళ్ళుతున్న రంభ రావణుని కంటబడింది.

''అదుగో! ఆ సుందరి ఎవరో సుతారంగా నడచి వెళ్ళుతున్నది. బంగారుపూల పట్టుచీర కట్టుకున్నది. ఆ చీర కుచ్చెళ్ళు ఎడమచేత్తో ఒయ్యారంగా పట్టుకున్నది. ఆ చేతికి తొడుక్కున్న పచ్చల కంకణాలు ధగ ధగ మెరుస్తున్నవి. గమనం వల్లనో, రమణుని స్మరణం వల్లనో ఆ చెలి చెక్కిళ్ళు చెమర్చుతున్నవి. ఆ నితంబం సౌరూ, ఆ నెన్నడుము తీరూ ఎంతచూచినా తనివి తీరటం లేదు. ఇది ఎక్కడి నుంచి వస్తున్నదో! ఎక్కడికి పోతున్నదో!'' ఇవి రావణుని ఆలోచనలు.

ఈ పద్యంలో రంభ చలత్సౌందర్యము బొమ్మ కట్టింది. 'ఒంటి పాటునన్' అన్నమాట అసురేంద్రుని ఆశను బైట పెట్టింది. అంకారం — స్వభావోక్తి.

## 20

పావురుఁగానిఁ జూచి వెఱపైకొనఁ దల్లడమందు నూరుతే
జీ వలె, గుండె ఝల్లుమనఁ జేష్పడి, వేల్పు వెలంది పోవ, నా
క్రోవకు నడ్డమై నిలిచి, తొయ్యలి కేల్గవఁ బట్టి నిల్పి, సొం
పావహిలంగ దాని మొగమట్లె కనుంగొని రావణుం డనున్. (4.195)

రంభకు ఎదురు వచ్చాడు రావణుడు. అతణ్ణి చూచి అదలి పోయింది రంభ. గండుపిల్లిని చూచిన రాచిలుకలాగా గుండె జల్లుమని తల్లడిల్లింది. తోడ్పాటు లేని ఆ చెలి చేస్పాటుతో ప్రక్కకు తొలగి పోబోయింది. రాగాంధుడైన రావణుడు ఎడ్డెతనంతో వచ్చి దారికి అడ్డంగా నిలబడ్డాడు. చేతులు రెండూ గట్టిగా పట్టుకొని రంభను నిరోధించాడు. ఆమె ముఖంలోకి ఆశగా అదే పనిగా కనుగొన్నాడు రావణుడు.

బావురు పిల్లితో పోల్చడం వల్ల రావణుని రాక్షసత్వం, ఘాతుకత్వం, భయంకరత్వం అభివ్యక్తమవుతున్నవి. రాచిలుకతో ఉపమించటం వల్ల రంభ రామణీయకం, సౌకుమార్యం, భీరుత్వం స్ఫురిస్తున్నవి. త్రోవకు అడ్డమై నిలవటం, చేతులు పట్టి బలవంతంగా నిలపటం రావణుని మోటుతనాన్ని చాటుతున్నవి.

అలంకారం - ఉపమ

# 21

*"ఎవ్వారి దానవే జలరుహేక్షణ! యెయ్యది పేరు దెల్పవే?*
*జవ్వని! యెవ్వానిం దలంచి చయ్యనం బోయెదవే? మిటారి! నీ*
*జవ్వనమున్ విలాసమును జక్కఁదనంబును నీటుఁ జూచినన్*
*బువ్విలుకానికైన భ్రమ పుట్టఁగదే భువనైక మోహినీ!"*

(4.196)

రావణుడు రంభతో అంటున్నాడు—

కమలాల వంటి కన్నులు గల యువతీ! ఎవతెవు నీవు? జవరాలా! నీ పేరేమి? మిటారీ! ఎవని కోసం నీ వింత వేగంగా వెళ్లుతున్నావు? భువనైక మోహినీ! నీ ఎల ప్రాయమూ, నీ ఒయ్యారమూ, నీ సొగసూ, నీ నీటు గోటులూ తిలకిస్తే కామునికైనా వ్యామోహం కలుగక తప్పదు. అందరికీ భ్రమ పుట్టించే పువ్విలు కానికి సైతం భ్రమ పుట్టించేదిగా ఉన్నది నీ భువన మోహన స్వరూపం. ఇక నాకు నీ మీద మోహం కలగటంలో ఆశ్చర్యం ఏముందని భావం. నీ వన్నె చిన్నెలు నన్ను లోగొన్నాయని సారాంశం.

ఈ పద్యంలో జలరుహేక్షణ, జవ్వని, మిటారి, భువనైక మోహిని అనే సంబోధనలవల్ల రంభ అందచందాలు స్ఫురించటమేకాకుండా రావణునికి ఆమె

పట్ల కలిగిన వ్యామోహం కూడ వ్యక్తమవుతున్నది. "భువనైక మోహినీ" అన్నది సాభిప్రాయ విశేషణం. ఇంతటి సౌందర్య విశేషం కలిగి ఉండటం నీ దోషం కాని, నిన్ను మోహించటంలో నా దోషం లేదని ధ్వని.

# 22

*"కామిరెలు నీకు లేరె ! పది కోటులు వత్తురు కోరితేని; యీ*
*తమకము మేరగాదు," సుత దారను బట్టి దశాస్యుఁడెంత య*
*క్రమ మొనరించెఁ జూడు" మనరా సరివా ! రపకీర్తి హేతువౌ*
*నిమిష సుఖంబు కోరి జననిందలఁ బొందుదురే భవాదృశుల్ !"*
(4.210)

తన నాయకుడైన నలకూబరుని కోసం పోతున్న తన్ను మధ్యే మార్గంలో పట్టుకొని బలాత్కరించే రావణుని బతిమాలుతూ రంభ పలికే పలుకులివి -

నీవు కావాలని కోరాలేగాని "కో" అంటే కోటి మంది పడుచులు పరుగెత్తుకు వస్తారు. నామీద వ్యామోహం న్యాయం కాదు. నేను నీకు కోడలి నౌతాను. నీ అన్నగారైన కుబేరుని కొడుకు నలకూబరుడు నా హృదయేశ్వరుడు. నీవు నాకు మామగారి వౌతావు. "దశాస్యుడు తన కోడలిని బలాత్కరించాడు. ఎంత దుర్మార్గం" అని వ్రేలెత్తి చూపి సరివారు పరిహసిస్తారు, నీ వంటి గొప్పవారు నిమేష సౌఖ్యం ఆశించి నిందల పాలు కావటం, అపఖ్యాతి పొందటం ధర్మం కాదు.

ఈ పద్యంలో రంభ ఉక్తి చాతుర్యం వ్యక్తమౌతున్నది. "భవాదృశుల్" అన్న మాటలో ఎంతో ధ్వని ఉన్నది. గొప్పవాడవు. ఎంతో కీర్తి గల వాడవు. వీరాధి వీరుడవు. కైలాసమెత్తిన మేటివి. జగజ్జేతవు. లంకాధిపతివి. నీ వంటి మహానుభావులకు ఈ వేగిరపాటు, ఈ చిన్న పొరపాటు పెద్ద కళంకం కలిగిస్తుందని భావం.

పై పద్యానికి సమాధానంగా వారకాంతకు వావులేమిటని పంక్తికంఠుడు పలికిన ఈ క్రింది పద్యం ప్రసిద్ధమైనది -

*"జనకుండు సుతుడును జన్నంబు సేసిన*
*వనిత ! వారేమి కావలయు నీకు ?*
*అన్నదమ్ములు సోమయాజులై వచ్చిన*
*వనిత ! వారేమి కావలయు నీకు ?*
*బావయు మఱఁదియు బవరానఁ గూలిన*
*వనిత ! వారేమి కావలయు నీకు ?*
*అల్లుండు మామయు ననిఁ ద్రెళ్లి వచ్చిన*
*వనిత ! వారేమి కావలయు నీకు ?*
*వావి వరుసలు గణియింపవచ్చి తేని*
*వనిత ! మాతోడ మాటాడ వశమె నీకు ?"*

యజ్ఞాలు చేసి సోమయాజులైన వారికీ, రణరంగంలో మరణించిన వారికీ, రంభా సంభోగం ప్రాప్తిస్తుందని శాస్త్రం.

బలవంతంగా తన కోరిక తీర్చుకున్నాడు మోటు రాక్షసుడు. అందుకనే వాని మోటుతనాన్ని చాటుతూ "రాజహంస విహార రమణీయతార్హమౌ కొలను 'లులాయంబు' కలచినటులు" అన్నాడు కవి.

# 23

*"ఈ దనుజుండు, కోరిక వహింపని రంభను బల్మిఁ బట్టిన*
*ట్టాదట నింక నొప్పని మృగాక్షుల బల్మిని బట్టెనేని, స*
*మ్మోదము దీఱ, నంత శిరముల్ పదియుం బదినూఱు వ్రక్కలై*
*మేదినిఁ గూలుఁ గావుత నిమేషములో భువనంబు మెచ్చఁగన్."*

(4.235)

రావణుని రాక్షస బాహు బంధంలో గాసిపడి, వాసిచెడి, నలిగి, కలగి, అదరి, బెదరి, చెదరిన రంభ నలకూబరుని చేరి తన భంగపాటు చెప్పుకుంది. క్రుద్ధుడైన కుబేర నందనుడు ఈ విధంగా శపించాడు దశగ్రీవుణ్ణి—

"ఈ రాక్షసుడు ఇకమీద ఈ విధంగా ఇష్టంలేని ఇంతులను బలాత్కరిస్తే పది శిరస్సులూ పది వందల వ్రక్కలై పీడు నేల గూలుతాడు."

"నిమేషములో" అనటం శాప వేగాన్ని ప్రకటిస్తుంది. నలకూబరుని శాపం లోకంలోని నారీ లోకానికి వర ప్రసాదమయింది సీతను కూడా రావణుని

బలాత్కారం నుంచి ఈ శాపమే కాపాడింది. అందుకనే ''భువనం మెచ్చగన్'' అనటం.

ఈ శాప స్వరూపం తిక్కనగారి ''నిర్వచనోత్తర రామాయణం''లో ఇలా ఉంది -

... ''ఇంక దశ కంధరుఁడెవ్వతెనైన నీ క్రమం
బునఁ బయిఁ బడ్డ నష్ట మృతిఁ బొంద గలండు''

దీనికి వాల్మీకి రామాయణంలో మూలం ఇలా ఉంది -

''యదా హ్యకామాం కామార్తో ధర్షయిష్యతి యోషితమ్
మూర్ధాతు సప్తధా తస్య శకలీ భవితా తదా.''

వీని తల ఏడు ముక్కలౌతుందని మూలంలో ఉన్నదాన్ని మార్చి ''వీని తలలు వెయ్యి వ్రక్కలు కావా''లని కంకంటివారు అనిపించారు.

ఏవం రూపమైన శాపం నలకూబరుని కోపంలోని ఆటోపాన్ని అభివ్యక్తం చేస్తుంది. తిక్కనగారు ఈ గొడవంతా లేకుండా ''అష్ట మృతిఁ బొందఁ'' గలడని పల్కించారు.

# 24

*"పతి యనుమతి గౌరీసతి*
*వ్రతి యగు నయ్యువతి నియమ భవ్యమతి ''సదా*
*గతి'' య సదా గతి యని యు*
*గ్రతపం బొనరించెఁ బెక్కు కాలం బధిపా !''* (5.93)

శ్రీరామచంద్రుని పేరోలగం. అగస్త్యమహర్షి వక్త. రాముడు శ్రోత. తమకు మహోపకారం చేసిన హనుమంతుని వృత్తాంతం చెప్పుమని అడిగాడు రాముడు. అగస్త్యుడు హనుమంతుణ్ణి చూపించి - ఇతడుసాక్షాత్తు శంకరుని అవతారమనీ; రుద్ర తేజస్సు పార్వతీదేవి గర్భంలో నుంచి అగ్నిదేవునిలోకి, అగ్నిదేవునిలోనుంచి వాయుదేవునిలోకి సంక్రమించిందనీ, తర్వాత వాయు దేవుని వరప్రసాదం వల్ల అంజనాదేవి గర్భం ధరించి ఆంజనేయుణ్ణి కన్నదనీ సంక్షిప్తంగా చెప్పి, అనంతరం అంజన తపస్సును అభివర్ణిస్తున్నాడు-

కేసరి అనే వానర రాజు అర్ధాంగి అంజన. పార్వతీదేవి వంటి ఆ సతి పతి అనుమతి పొంది నియమవంతురాలై 'సదాగతి' యే తనకు సదా గతి యని భావించి అనేక సంవత్సరాలు ఉగ్రమైన తపస్సు ఆచరించింది.

అక్షర రమ్యమైన అనుప్రాసతో అలరారే అందమైన కందమిది. 'సదా గతి' అంటే వాయుదేవుడు. ''సదాగతియ - సదా గతియని'' అన్న యమకం లోని శబ్ద సౌందర్యం హృదయంగమం.

గౌరీ సతికి ప్రతియైన యువతి కనుకనే పరమ శివుని తేజస్సును భరింప గలిగిందని పరమార్థం.

# 25

*"అంతటిలోన నీతఁడుదయాద్రి పయిం బొడతెంచు పద్మినీ*
*కాంతు జపాప్రసూన రుచి కాంతుఁ గ పంగొని, పండటంచు వి*
*భ్రాంతి వహించి యాకటి తొరన్ రవిపై కెగసెన్, సమీర నా*
*గాంతక బాణవేగ పరిహాసి సమిద్ధ మహా జవోన్నతిన్."* (5-99)

అగస్త్యుడు హనుమంతుని జన్మ వృత్తాంతం చెబుతున్నాడు శ్రీరామునితో-

వాయుదేవుని వరప్రసాదం వల్ల అంజనాదేవి కుమారుణ్ణి కన్నది. అబ్బాయి ఆకలికి ఆగలేక ఏడుస్తుంటే అమ్మ బుజ్జగించి చెక్కునొక్కి - అక్కున చేర్చి-ముద్దాడి ''నీకు కావలసినన్ని పండ్లు తెస్తాను ఏడ్వబోకు''మని అడవిలోకి వెళ్ళింది.

అంతలో ఉదయాద్రి మీద ఉదయిస్తున్న సూర్యబింబాన్ని చూచాడు - బాలాంజనేయుడు. ఎర్రని పండు అని భ్రమ కలిగింది. ఇంకేముంది ! ఆ కటి తొందరతో ఆగలేక అమాంతం ఉదయిస్తున్న సూర్యబింబంవైపు వాయు వేగాన్నీ, గరుడవేగాన్నీ, శరవేగాన్నీ మించిన మహావేగంతో గగనంలోకి ఎగిరాడు.

ఇక్కడ వాయునందనునికి వాయువేగాన్ని మించిన వేగం చెప్పటంవల్ల తండ్రిని మించిన కొడుకైనాడని భావం. గరుడవేగాన్ని పేర్కొనటంవల్ల పూర్వం అమృతభాండం కోసం ఖగరాజు గగనానికి ఎగిరాడనీ, అతనికిలాగే

ఇతనికీ కార్యసిద్ధి అవుతుందనీ సూచించడం. శరవేగాన్ని ఉదహరించటం లక్ష్యశుద్ధికి ఉపలక్షణం. పై మూడు జవాలనూ పరిహసించేది కనుకనే అది ''మహాజవం'' అనబడింది. బాలభానుని ఎఱ్ఱదనం-గుండ్రదనం ఫలభ్రాంతికి హేతువులు.

అతడూ అప్పుడే ఉయిస్తున్నాడు - ఇతడూ ఇప్పుడే ఉదయించాడు. ఇరువురూ పసివారు కావటంలో ఔచిత్యం ఉంది. అమాయకత్వం ఉంది.

అలంకారం - భ్రాంతిమంతం.

# 26

*"పలుకుల వెలంది తళుకుఁ జెక్కుల విచిత్ర*
*పత్రముల వ్రాయనేర్చిన పాణి ననిల*
*సుతుని నెమ్మేను నివిరిన శోషదీఱి*
*వాఁడు లేఁబైరు వానచే వలెఁ జెలంగె."* (5.125)

వాసవుని వజ్రాయుధం దెబ్బకు మూర్ఛిల్లి పడిపోయిన తన తనయుని పాటు చూచి వాయుదేవునికి కోపం వచ్చింది. తన మూర్తిని ఉపసంహరించాడు. ఇంకేముంది వాయు ప్రసారం లేక జగం శవప్రాయ మయింది. దేవతల ప్రార్థన విని బ్రహ్మదేవుడు దిగి వచ్చాడు. వాయుదేవుణ్ణి సమాధాన పరిచాడు. పడియున్న పవమాన సుతుణ్ణి బ్రతికించాడు. ఆ సందర్భంలోని పద్యమిది-

ధాత ప్రీతితో వాతాత్మజుని నెమ్మేను చేతితో నిమిరాడు. ఆ చేయి ఎటు వంటిది! వాగ్దేవి కపోల ముకురాలపై మకరికా పత్రాలు చిత్రించేది. వాణి చెక్కిళ్ల అలంకరించే పాణితో సృష్టికర్త చిన్నారి పాప మేను స్పృశించాడు. ఆ స్పర్శకు వాడు వాడిన లేతపైరు వర్షం కురవగానే హర్షంతో లేచినట్లు శోషతీరి లేచి కూర్చున్నాడు. అలంకారం-ఉపమ.

# 27

*''చదువుల్ నేర్చుకొనంగ వచ్చితివె! వత్సా! త్రోవ నెట్లభ్యసిం*
*చెదు? నా ముందట నిల్వఁగూడదు గదా! శీఘ్రంబునం బోయినన్*
*మది యేకాగ్రతఁ బొందునే? నుడువు" మన్నన్ నవ్వి యవ్వీరుఁడ*
*య్యుదయాస్త్రాద్రుల నిల్పెఁ బాదయుగళం బుత్సేధ దేహోగ్రుఁడై.*
(5-138)

బాల్యంలో చేసిన వాగ్దానాన్ని పురస్కరించుకొని విద్యలు నేర్చుకోవలెననే కోరికతో ఒకనాడు భానుని దగ్గరకు వెళ్లి ప్రణామం చేశాడు పవమాన సూనుడు. అప్పుడు అంశుమంతుడు హనుమంతునితో అన్న మాటలివి -

''నా దగ్గర చదువుకుందామని వచ్చావా నాయనా! చాలా సంతోషం. కాని నేను అహరహమూ అనుక్షణమూ అతి వేగంతో పరిభ్రమిస్తూ ఉంటానే! నా వేగాన్ని ఎట్లా అందుకుంటావు? నా ముందు ఎట్లా నిలబడతావు? నీ చదువు ఎట్లా సాగుతుంది? నీకు ఏకాగ్రత ఎట్లా కుదురుతుంది? నీవే ఆలోచించి చెప్పు''.

సూర్యుని మాటలకు హనుమంతునకు నవ్వు వచ్చింది. ఆ మహావీరుడు త్రివిక్రమునిలా విజృంభించి తన దేహాన్ని పెంచాడు. ఒక పాదం ఉదయాద్రి మీదా-మరొక పాదం అస్తాద్రి మీదా పెట్టి నిలబడ్డాడు. అతని విశ్వరూపానికి విస్మితుడైనాడు వివస్వంతుడు.

తర్వాత ఎప్పటిరూపం ధరించి, దినకరుని తేరుకు ఎదురుగా నిలబడి, వెనువెనుకకు వేగంగా ప్రయాణం చేస్తూనే సమస్త విద్యలూ అభ్యసించి నవ వ్యాకరణ పండితుడైనాడు హనుమంతుడు.

పై పద్యంలో ఆచార్యుడైన సూర్యుని శిష్యవాత్సల్యమూ, అంతేవాసియైన ఆంజనేయుని దీక్షా దృఢత్వమూ ప్రకటిత మౌతున్నది.

## 28

*''కుడిచి చల్లని నీడలఁ గూరుచుండి*
*గురువు చెప్పినఁ జదువ రీ ధర వడుగులు;*
*నిరశనుండయి పఱచుచు నింగిఁ గఱకు*
*టెండకు సహించి చదివె, నీతండు ఘనుఁడు!''* (5-141)

ఆనాటి గురుశిష్యుల సంబంధాన్ని తననాటి గురుశిష్యుల సంబంధంతో పోల్చి చూస్తున్నాడు కవి.

ఈనాటి శిష్యులు కడుపు నిండా భోజనం చేస్తారు. పాఠశాలల్లో చల్లని ప్రదేశాలలో కూర్చుంటారు. అన్ని సౌకర్యాలూ ఉండీ కూడా అయ్యవారు చెప్పిన పాఠాలు చదవటానికి బద్ధకిస్తారు. ఇక ఆనాటి శిష్యుడైన హనుమ పట్టుదల చూడండి. అన్నాహారాలు మాని, గురువుగారితోపాటు గగనంలో పరుగు లిడుతూ, మండు టెండలో మాడుతూ అతడు ఆచార్యునివద్ద శ్రద్ధా

సక్తులతో అన్ని విద్యలూ అభ్యసించాడు అతడు ఎంత గొప్పవాడో అని మెచ్చుకుంటాడు కవి.

ఈ పద్యంలో కంకంటి పాపరాజుగారు తనకాలం నాటి సోమరిపోతు విద్యార్థులను విమర్శించటం గమనార్హం.

''శ్రద్ధయా వర్ధతే విద్యా'' అని పరమార్థం.

హనుమంతుని విద్యాభ్యాసం మూలంలో ఒక్క శ్లోకంలో మాత్రమే వర్ణింపబడింది- ''అసౌ పున ర్వ్యాకరణం గ్రహీష్యన్ సూర్యోన్ముఖః పృష్ఠగమః కపీంద్రః ఉద్యద్గిరే రస్తగిరిం జగామ'' అని. తిక్కనగారు ఈ శ్లోకానిః అనువాదంగా-

''ఇను నరదము ముందట వెను
వెనుకను వెస జనుచు శబ్ద విద్యాధ్యయనం
బొనరించె నాతఁ డొజ్జగ
హనుమంతుం బోల నలవి యగునె యొరులకున్ ?''
అని ఒక కంద పద్యం మాత్రం వ్రాశారు.

అయితే కంకంటి వారు ఈ సందర్భాన్ని చక్కని సంభాషణలతో, సరస మైన సన్నివేశాలతో నాటకీయంగా ఐదారు పద్యాలలో విస్తరించి వ్రాయటం విశేషం.

# 29

*నా విని సంతసించి రఘునాథుఁడు గద్దియ డిగ్గి గ్రక్కునం*
*బావనిఁ జేతులం గదియఁబట్టి కవుంగిటనుంచి పల్కె "న*
*న్నీ విపుడిచ్చ్చయించినవి యిచ్చితి; భూమి కలంతకాలమున్*
*దావక కీర్తియున్ నిలుచుఁ దంద్రి! చరింపు చిరాయు రున్నతిన్."*
(5-306)

పట్టాభిషేకానంతరం తన్ను దర్శించి అభినందించటానికి వచ్చిన అగ స్త్యాది మహర్షులను సగౌరవంగా వీడ్కొల్పాడు శ్రీరామచంద్రుడు. సంగర రంగంలో తనకు సహాయం చేసిన వానర వీరులందరినీ ప్రశంసించి బహూ కృతులిస్తున్న సమయంలో హనుమంతుడు లేచి చేతులు మోడ్చి ''స్వామీ !

నాకు సదా మీ పదభక్తి ప్రసాదించి మీకథ యెంతకాల మూర్విని దగునంత కాలము శరీరము నిల్వ వరంబొసంగవే!'' అని పరిపరి విధాల ప్రార్థించాడు. ఆ సందర్భంలోని పద్యమిది–

హనుమ అభ్యర్థనకు రఘునాథునికి సంతోషం కలిగింది. గ్రక్కున గద్దియ దిగడం వల్ల ఆయనకు హనుమపై గల ఆదరాభిమానాలు స్ఫురిస్తున్నాయి. చేతులు చాచి గాఢాలింగనం చేసికొనటంలో రాముని అపార వాత్సల్యం వ్యక్త మౌతున్నది. అర్థించిన వస్నీ అనుగ్రహించి ''భూమి కలంత కాలం నీ కీర్తి స్థిరంగా ఉంటుంది తండ్రీ! నీవు చిరంజీవివై ఉంటావు'' అనటంలో ఒక చమత్కారం ఉంది.

''మీ రామాయణ కథ భూమిపై ఉన్నంత కాలమూ నేను కూడా జీవించి ఉండా''లని వరం కోరాడు హనుమంతుడు. ''భూమి ఉన్నంత కాలం నీ కీర్తి ఉంటుంది. నీవూ ఉంటావు'' అని వర మిచ్చాడు స్వామి. ''నా కథ శాశ్వతంగా భూమిపై ఉన్నంతకాలం'' అని అనలేదు. అలా అనకపోవడం రామ భద్రుని వినమ్రతను ప్రకటిస్తుంది. భూమి కలంత కాలం రామకథ ఉంటుందని ధ్వని.

# 30

*''ఆపదఁ బాపి ప్రాపయిన యన్నకుఁ బ్రత్యుపకార మూనఁగాఁ*
*గా పురుషుండు గోరుఁ; బ్రతికారము సేయఁదలంపఁ డార్యుఁడ*
*య్యాపద రాఁదలంచినటు లౌనని, ధన్యుఁడవైన నీకు లే*
*వాపద లేఁ బ్రతిక్రియ యొకప్పుడుఁ జేయఁ దలంపఁ బావనీ!''*

(5-307)

శ్రీరాముడు హనుమంతునితో అంటున్నాడు -

''ఆపద సమయంలో అండగా నిలిచి అపారమైన ఉపకారం చేసిన ఆత్మీయునికి తిరిగి తాను ప్రత్యుపకారం చెయ్యాలనుకోవటం కాపురుష లక్షణం. ఉత్తమ పురుషుడైనవాడు ఎప్పుడూ ఉపకారం చెయ్యాలనుకోడు. ఎందువల్లంటే తను ఉపకారం చెయ్యాలనుకోటం ఎదుటి వాడికి ఆపద రావాలని కోరడమే అవుతుంది.

పావనీ! నీవు ధన్యుడవు. మమ్మల్ని కష్టాల్లో ఆదుకొని మా ప్రాణాలను నిలబెట్టిన మహానుభావుడవు. నీకు ఆపద లంటూ రానూ కూడదు. మేము ప్రత్యుపకారం చెయ్యాలని కోరనూ కూడదు.''

ఈ పద్యంలో ఆంజనేయుని నిస్వార్థ సేవా నిరతీ, రాముని అపార కృతజ్ఞతా భావమూ, చక్కని ఉక్తి వైచిత్రీ ధ్వనిస్తున్నవి.

# 31

*ప్రాతర్వేళల మంచుచిన్కు గుమి దొంపంబైన లేఁబచ్చికల్*
*శ్వేతశ్రీఁ దులకించు టెంతయు రహించెన్, సర్వభూతంబులున్*
*శీతభ్రాంతి వడంకఁ దా నచలయై చెల్వొందు భూదేవికిన్*
*శీతర్తుప్రభుఁ డిచ్చు వజ్రముల రాశింబోలి నల్వంకలన్.* (5-289)

ఇది హేమంత ఋతు వర్ణనం. తెల్లవారేసరికి దట్టంగా పెరిగి ఉన్న పచ్చిక బయళ్ళ నిండా మంచు కురిసింది. స్వచ్ఛ ధవళ కాంతులతో హిమ బిందువులు శాద్వల స్థలులమీద నలువంకలా వజ్రాల రాసులు ఆరబోసినట్లున్నాయి.

వాటిని కవి ఇలా సంభావిస్తున్నాడు- తన శీతలత్వానికి సమస్త భూతాలూ గడగడ వణకిపోతుంటే అణుమాత్రం కూడా వణకకుండా 'అచల' యై ఉన్న భూదేవిని చూచి హేమంత ప్రభువు సంతోషించి ఆమెకు బహూకరించిన వజ్రాల రాసుల్లాగా ఉన్నాయిట. ఆ హిమబిందు సందోహాలు.

'అచల' అని భూమికి పేరున్నది.

అలంకారం - ఉత్ప్రేక్ష, పరికరం.

# 32

*''గోరంట నెదనుంచి కొమ్మ! యశోకంబు*
*తన్నితి విదియేమి తప్పొనర్చె?*
*సఖి! గోఁగు తోడ ముచ్చటలాడి సురపొన్న*
*నవ్వితి విదియే గుణంబు దప్పెఁ?*
*గలికి! ప్రేంకణము చెంగటఁ బాడి పొగడపై*
*నుమిసితి విదియే దురుస్తు లాడెఁ?*
*జాన! మామిడి నంటి సంపెంగకును మోము*
*చక్కఁజూప వదేమి తక్కువయ్యె?*

*తిలక భూజంబుఁ గారుణ్యదృష్టిఁ జూచి*
*సింధువారంబు చెంగటఁ జేరి యుసురు*
*మంటి వదియేమి యపరాధ మాచరించె ?*
*సువిద ! యీ పక్షపాత హేతువు గణింపు?''* (6–38)

పట్టాభిషేక మహోత్సవానికి వచ్చిన చుట్టాలూ స్నేహితులూ అంతా వెళ్ళిపోయారు. వసంతం వచ్చింది. వనలక్ష్మి స్వాగతమిచ్చింది. సఖీజన సమేత యైన సీతతో శ్రీరాముడు ఉద్యానంలో విహరిస్తున్న సన్నివేశం. ఆ సందర్భంలో జానకీజాని జనక పుత్రితో సరసోక్తు లాడుతున్నాడు-

''కోమలీ ! ఈ తోటలో ఉన్న అన్ని చెట్లూ నీకు సమానమే గదా ! కొన్ని చెట్లను నీవు కౌగిలించి, ముచ్చటాడి, గానం వినిపించి, చేతితో స్పృశించి, దయతో దర్శించి గారవించావు. మరికొన్ని చెట్లను తన్ని, పరిహసించి, ఉమ్మి వైచి, మోము త్రిప్పుకొని, నిట్టూర్చి, నిరాదరించావు. పాపం ! అవేం పాపం చేశాయో ! ఇంత పక్షపాతం వహించటానికి హేతు వేమిటో! ''

చెట్లనూ తీవలనూ కాలం కాని కాలంలో పూలు పూయించటానికి స్త్రీలు కావించే చేష్టా విశేషాన్ని 'దోహదం' అంటారు. ఆయా వృక్షాలకు ఆయా దోహదాలు ఏర్పాటై ఉన్నాయి.

''అశోక శ్చరణా హత్యా వకుళో ముఖసీధునా
ఆలింగనాత్ కురవక స్తిలకో వీక్షణేనచ
కరస్పర్శేన మాకందో ముఖరాగేణ చంపకః
సల్లాపతః కర్ణికారః సిందువారో ముఖానిలాత్
గీత్యా ప్రియాళు ర్నితరాం నమేరు ర్హాసితేనచ.''

అందమైన ఆడపిల్లలు తంతే అశోకం పుష్పిస్తుంది. అదే విధంగా పుక్కిలించి ఉమ్మివేస్తే పొగడ చెట్టూ, ఆలింగనం చేసుకొంటే గోరంటా, కన్నెత్తి చూస్తే తిలక వృక్షమూ, కరస్పర్శచేత మామిడీ, ముఖరాగం చేత సంపెంగా, ముచ్చటాడితే కొండగోగూ, నిట్టూర్పు గాలి చేత వావిలీ, సంగీతం చేత ప్రేంకణమూ, నవ్వితే సురపొన్నా అకాలంలో పూస్తాయి. ఇది దోహద లక్షణం.

సీత ఆ విధంగా దోహదం చేస్తుంటే శ్రీరామునిచేత నర్మోక్తులు పలికించటంలో కావ్యకతమైన చమత్కారం చివురు తొడిగి పూలు పూచింది.

# 33

*శ్రీ రఘువీరశేఖరుఁడు చిత్తము రంజిలఁ బల్కు చిల్కముం*
*జేరహియింప సీతఁగని "చెల్వరో! నీ యధరంబు బింబికా*
*శ్రీరస మొల్కు రాచిలుక చేరెడు నంచునొ జిల్లు నవ్వులన్*
*వారక మాటు సేసెదవు? వంచన సేతురె యాశ్రయించినన్?"*

(6–50)

సీతా రాములు వనంలో తిరుగుతున్నారు. ఇంతలో ఒక చిలుక వచ్చి శ్రీరాముని చేతిమీద వ్రాలింది. రాముడు దాన్ని చేతితో దువ్వి లాలిస్తున్నాడు. అది అదేపనిగా సీత ముఖం వైపు చూడసాగింది. ఇదంతా చూచి సీత నవ్వటం మొదలు పెట్టింది. అరవిచ్చిన విరజాజుల వంటి చిరునవ్వులు చిందిస్తున్న శ్రీమతితో నర్మగర్భంగా అన్నాడు శ్రీ రఘువీరుడు -

''చెలీ! ఎందుకూ మాటిమాటికీ అలా నవ్వుతున్నావు? ఓహో అర్థమయిందిలే! అరుణారుణమైన నీ అధర బింబాన్ని బింబఫలంగా భావించి ఈ ముద్దుల చిలుక నీ ముఖంమీద వచ్చి వాలుతుందేమో ననే సందేహంతో ఎర్రని పెదవిని తెల్లని నవ్వు తెరలతో కప్పేసుకుంటున్నావు! అయినా వచ్చి ఆశ్రయించిన వారిని వంచించటం అన్యాయం కాదా?''

శ్రీరాముని ఛలోక్తికి సీతమ్మ లోలోపల ఎంతో సంతోషించింది.

ఇలా అనటం వల్ల సీతాదేవి కెమ్మోవి తళుకూ, తెలినవ్వుల బెళుకూ స్ఫురిస్తున్నాయి.

అలంకారం-భ్రాంతిమంతం-తద్గుణం-అర్థాంతరన్యాసం.

పై పద్యంలోని కల్పన కంకంటి వారికి చాలా ఇష్టం. ఈ కమనీయ కల్పనతోనే ఆయన ఈ గ్రంథానికి శ్రీకారం చుట్టాడు -

*''శ్రీ రాధాధర బింబమున్ దొరయు రాచిల్కన్ నిజోరస్థలీ*
*రారా జన్మణి కాంతి రాఁ బిలిచి తద్రాకేందుబింబాననా*
*స్మేరాంకూరము చేఁ గృతార్థుఁడగుమన్ జెల్వొందు గోపాంగనా*
*జారగ్రామణి కృష్ణుఁ డీవుత మహైశ్వర్యంబు మాకెప్పుడున్.''*

(1-1)

# 34

*కరమున మెట్ట దమ్మివిరిఁ గైకొని రాఘవుఁ "డందుకోవె సుం*
*దరి!" యని యాసఁ జూపి, వనితామణి యించుక నిక్కి పాణిపం*
*కరుహము సాఁచినన్, బొడవుగా మఱియున్ గరమెత్తు, బాహుమూ*
*లరుచులు బాలుపయ్యెదఁ జెలంగు కుచంబులుఁ జూచువేడుకన్.*

(6-54)

వన విహారంలో సీతారాములు మరికొంచెం ముందుకు సాగారు. శ్రీరాముడు ఒక మెట్ట తామర పువ్వును చేత్తో పైకెత్తి పట్టుకొని "సుందరీ! అందుకో!" అన్నాడు. జానకి కొంచెం నిక్కి అందుకోటానికి చేయి చాచింది. రాముడు తన చేయి ఇంకా పైకెత్తాడు. ఈ విధంగా సీత చేయి చాచిన కొద్దీ శ్రీరాముని చేయి పైకి పోవటం సాగించింది. ఎందు కంటే ఆ విధంగా పూవు కోసం పైపైకి చేయి చాచే దేవి ఒయ్యారపు సొగసులు అయ్యవారికి ఎంత చూచినా తనివి తీరటం లేదు. కంకంటి వారి కలం ఇక్కడ చాలా మధుర మోహనమైన చిత్రాన్ని గీచింది.

ఇదే సందర్భంలో ఇటువంటి భావాన్నే ప్రకటిస్తున్న మరో హృద్యమైన పద్యం చిత్తగించండి–

*"నిగిడి నిక్కిన బాలు నీవి గన్గొను నాస*
*వెలఁది కందని తీగపరులఁ జూపు*
*వలువ యెత్తిన నూరువులు చూచు తమిఁదలో*
*దరికిఁ బిన్నిరేటి దాఁకఁ జూపు*
*నళివంక్తి కళికి కౌఁగిలి యిప్పునను కోరిక్కఁ*
*బొలతికి విరిపువ్వుఁ బొదలఁ జూపు*
*బడలి పై నొఱఁగునన్ బాలి నాతికిఁ గప్పు*
*రపుఁ దిప్ప లొప్పు నరంట్లు చూపు*

*నధర బింబంబుపైఁ గొంకు నడరు కలికి,*
*చిలుక నడలింపఁ బెక్కురల్ చిలుక పలుకు*
*విను ప్రియంబున గల మావి వనుఁ జూపు*
*సీత కవ్వేళ రఘువీర శేఖరుండు."* (6-55)

# 35

*''ఎలదీఁగన్ సుమకాంక్షఁ జేరకు లతాంగీ! తీఁగకున్ మేనికిన్*
*దెలియన్ రాదు విభేద; మంచ కొలఁకింతీ! పోకువే, రాక పో*
*కల నీ కంచకు వేఱులేదు; చిలుకన్ గై నుంచకే చిల్కప*
*ల్కులలో నీ పల్కులో కాంచలే'' మనుచుఁ బల్కున్ రాముఁ డాయా*
*మెడన్.* (6-56)

''లతాంగీ! పూలకోసం ఆ తీవ చెంతకు పోబోకు. ఆ లతకూ నీ తనూలతకూ తేడా తెలియటం లేదు.

ఇంతీ! ఆ రాజహంసను చేజిక్కించుకోటానికి వెళ్ళబోకు. రాక పోకల్లో హంస నడకలకూ- నీ నడకలకూ భేదం కన్పించటం లేదు.

చెలీ! ఆ చిలుకను చేరదీసి చేతిపై కెక్కించుకోకు. అవి చిలుక పలుకులో- సీత పలుకులో గుర్తించలేకుండా ఉన్నాం.''

ఆరామంలో విహరించే సీతతో శ్రీరాముడు పలికే సరసోక్తులివి. లతాతన్వీ- హంసగమనా- కీరవాణీ ఐన జానకీదేవి సహజ సౌందర్యాన్ని సరసంగా సహృదయ హృదయంగమంగా ధ్వనింపజేసే చక్కని పద్యమిది.

అలంకారం- సందేహం- అతిశయోక్తి.

# 36

*''అంటితి వేమె పుష్పవతి యౌ లతకూనః నమైన నంటు; న*
*న్నంటకు ముస్గుదాఁక'' నని యవ్వాలి తేఁగిన, సీత నవ్వుచున్*
*వెంటనె పూఁబొదల్ దిరిగి వేసరి చెమ్మటఁ దొప్పదోగినన్*
*బంటి వలంతి యల్లుఁడు కృపానిధి కౌఁగిట గ్రుచ్చె నంతటన్.*
(6-57)

విరి తోటలో విహరిస్తున్నారు జానకీ రఘురాములు. మాటలు నేర్చిన రాముడు అమాయకురాలైన ప్రియురాలిని ఆటలు పట్టిద్దా మనుకున్నాడు.

''అదుగో! సీతా!'' 'పుష్పవతి' ఐన ఆ లతకూనను అంటుకున్నావు. ఆగు ఆగు! అక్కడే ఉండు! నీవు అంటుపడ్డావు. స్నానం చేసిందాకా నన్ను

అంటుకోకు'' అంటూ రాముడు దూరంగా వెళ్ళాడు. సీత నవ్వుతూ శ్రీరాముని వెంట పడింది. రాముడు అందకుండా అటూ ఇటూ పరుగెత్తాడు. శ్రీరాముడు ముందూ, సీత వెనుకా. ఇలా తోటలోని పూపొదలన్నీ తిప్పించాడు పాపం సీత తిరిగి తిరిగి అలసి పోయింది. అలా అలసి సొలసిన ఆ ఆర్ద్రమూర్తిని చూచి దయామూర్తియైన శ్రీరాముడు గాఢానురాగంతో గట్టిగా కౌగిలించుకొన్నాడు.

ఇచ్చట ''పుష్పవతి'' అనే పదానికి పూలతో కూడినది అనే కాకుండా 'రజస్వల' అనే అర్థం కూడా ఉంది. అలాగే ''లతకూన'' అంటే 'లత' అనీ, 'లతాంగి' అనీ రెండర్థాలూ వస్తాయి.

'రజస్వలను ముట్టుకుంటే స్నానం చెయ్యాలి' అనే సముదాచారం ఇక్కడ అనుసంధేయం.

''పంట వలంతి యల్లుఁడు'' అన్నది సాభిప్రాయ విశేషణం. భూదేవి అల్లునికి భూపుత్రి మీద ఆదరం కలగటం అత్యంత సహజమే గదా !

అలంకారం- శ్లేష.

# 37

*మొగములు గానరా నిగిడి కామిను లీఁదఁ*
*గొలనెల్లఁ జంద్ర మండలము లయ్యెఁ*
*గుచములు గానరాఁ గొమ్మ లీఁద సరోవ*
*రంబెల్ల గమల కోరకము లయ్యెఁ*
*గ్రొమ్ముడుల్ గానరాఁ గొమరె లీఁదఁగఁదటా*
*కం బెల్ల గాఢాంధకార మయ్యెఁ*
*బిఱుదులు గానరాఁ బిసరుహానన లీఁద*
*దీర్ఘికాంతర మెల్ల దీవులయ్యె*
*బాహువుల్ గానరాఁ బద్మపాణు లీఁద*
*సరసి యెల్ల మృణాళైక సదనమయ్యె*
*నంగములు గానరాఁ గాంచనాంగు లీద*
*సారసాకర మెల్ల బంగార మయ్యె.* (6-81)

3)

అద్భుతమైన సీస పద్యమిది. వన విహారానంతరం జలక్రీడలు ప్రారంభమైనాయి. సీతారాములతో పాటు సఖీ జన మంతా సరోవరంలో ప్రవేశించారు. నీళ్ళలో మునిగి తేలుతున్నారు. ఉల్లాసంతో జల్లులాడుతున్నారు. ఉత్సాహంతో ఈదుతున్నారు. ఆ సందర్భములోని వర్ణనమిది.

వారు తమ ముఖాలు మాత్రమే పైకి కన్పించే విధంగా నీళ్ళలో మునిగి ఈదుతున్నప్పుడు ఆ సరస్సంతా చందమామలు పరచినట్లయింది. ఉరోజాలు మాత్రమే కన్పించే తీరున వెలికిల పరుండి ఈదుతున్నప్పుడు సరోవరం సరోజ కోరకాలతో నిండినట్లయింది. క్రొమ్ముడులు మాత్రం కానవచ్చేటట్లు బోరగిల పరుండి ఈదుతున్నప్పుడు కొలనంతా చిమ్మ చీకటులు క్రమ్మినట్లయింది. జఘన ప్రదేశాలు మాత్రమే అగపడునట్లు ఈదుతున్నప్పుడు చెరువంతా తామర తూండ్లతో నిండిపోయింది. కరచరణా ద్యంగాలు కన్పించే లాగు కనకాంగులు ఈదు సమయంలో పద్మాకరమంతా బంగారు మయమయింది.

సీత చెలు లంతా చంద్రవదనలు, కోరక స్తనలు, సైకత నితంబలు, మృణాళ హస్తలు, కాంచ నాంగులు-అని పరమార్థం.

అలంకారం - అతిశయోక్తి.

# 38

*అవనిజ చూపులన్ రవికులాగ్రణి మైజిగి నల్లకల్వలున్,*
*కువలయ నేత్ర నవ్వులు రఘుప్రభు చూపులఁ దెల్లకల్వ, లె*
*క్కువయయి నిండె నీట; మునుగోసిన పువ్వుల కంటె రెట్టిగా,*
*నవుర! వధూ వరుల్ సరసి కర్పణ సేసి రనన్ జెలంగుచున్.*

(6-110)

స్త్రీల చూపులు నల్లగా ఉంటాయనీ, పురుషుల చూపులు తెల్లగా ఉంటాయనీ కవి సమయం. సీతాదేవి చూపులూ శ్రీరాముని నెమ్మేని కాంతులూ కలిసి సరస్సు నిండా నల్ల కల్వలను కల్పించాయి. శ్రీరాముని చూపులూ సీతాదేవి నవ్వులూ కలిసి తెల్ల కల్వలను వెలయించాయి. అంతకుముందు సరస్సులో నుంచి తాము కోసుకొన్న పువ్వుల కంటే రెట్టింపు పువ్వులను సమర్పించి ఆ దంపతులు సరోవర సౌందర్యసంపదకు ఏ మాత్రం లోటు వాటిల్లకుండా చేశారు.

ప్రసన్నత పరిమళించిన భావం.

కంకంటి వారు ఈ విధంగా 176 పద్యాలలో సీతారాముల సంయోగ శృంగారాన్ని సరసంగా సముచితంగా సర్వాంగ సుందరంగా అభివర్ణించి రాబోయే సీతారామ వియోగానికి పరిపుష్టి సంపాదించారు.

# 39

*జనపతి యిట్లు సీత యెల జవ్వన మంతయుఁ గొల్లలాడుచున్*
*దినములు గొన్ని దాఁటఁగ, రతిప్రియుఁ డస్త్రము దూణి మాటఁగా,*
*ననితర గర్భచిహ్న మచలాత్మజ దాలిచె, రాజమౌళితో*
*ననిశముఁగూడి తొల్లి యచలాత్మజ గర్భముఁ దాల్చుకై వడిన్.*

(6-177)

ఈ పద్యంలో సీతాదేవి గర్భవతి అవటం వర్ణింపబడింది.

రాజమౌళితో కూడి పూర్వం అచలాత్మజ గర్భం ధరించినట్లుగా రాజమౌళితో కూడి అచలాత్మజ గర్భం ధరించుట.

అచల + ఆత్మజ - అంటే గిరిపుత్రి పార్వతి.
అచలా + ఆత్మజ - అంటే భూపుత్రి సీత.

'రాజమౌళి' అంటే చంద్రశేఖరుడైన శివుడు అనీ, రాజశ్రేష్ఠుడైన రాముడనీ రెండర్థాలు.

పూర్వం శివునితో కూడి పార్వతి గర్భవతి ఐనట్లు శ్రీరామునితో కూడిన సీతాదేవి గర్భవతి ఐనదని భావం. ''రతిప్రియుడు తన బాణాలను అమ్ముల పొదిలో దాచాడు'' అన్నవాక్యం దంపతుల శృంగారకేళి విరామానికి సుకుమారమైన సూచన.

అలంకారము - శ్లేష - ఉపమ.

# 40

*''సోముని గెల్చిన నీ నగు*
*మోము ధరాదేవి మెచ్చి ముద్దిడు కొనెనో*
*కామిని! యది కాదేనియు*
*నీ మొగమున మంటితావి యేమిటి కొదవెన్?''* (6-184)

గర్భవతియైన ప్రియసతిని శ్రీరాముడు ఛలోక్తులతో పరిహసిస్తున్నాడు- ''సీతా ! భూమాత 'చందమామ' వంటి నీ ముఖసౌందర్యానికి ముచ్చటపడి ముద్దు పెట్టుకొన్నదేమో ! లేకపోతే నీ ముఖం మృత్తికా సుగంధాన్ని ఎందుకు వెలువరిస్తుంది ?''

సీత భూపుత్రి కావటం, గర్భవతులైన సతులు మట్టి తింటం ప్రసిద్ధం. కన్నతల్లి చిన్నారి బిడ్డ మోమును ముద్దాడటం సహజం.

అలంకారం-ఉత్ప్రేక్ష.

# 41

*''సారంగీ శిశుకోటి దప్పి పులి దీర్చన్, సింహ పోతక్రమం*
*బాఱన్ దంతి కరాంబువుల్ నిగుడఁజేయన్ మించు భాగీరథీ*
*తీరారణ్యములన్ వసించు మునిపత్నీ శ్రేణితోడన్ ఫలా*
*హారంబుల్ గొని యొక్కనాఁడు మెలఁగన్ ప్రాణేశా !*
*వాంఛించెదన్."* (6-188)

అంతర్వత్నియైన పత్ని దౌహృదవాంఛలు తెలుసుకొని తీర్చటం భర్తకు అవశ్యకర్తవ్యం. శ్రీరాముడు సీతను బుజ్జగించి ఒడిలో కూర్చుండ బెట్టుకొని నీ కోరికేమిటని అడిగాడు. సీత సిగ్గుపడుతూ తన మనోవాంఛితాన్ని మనోనాథుని ముందు ప్రకటించింది.

''ప్రాణేశ్వరా ! బాలెంతపులి పాలిచ్చి లాలించే లేడి పిల్లలతోనూ, ఏనుగు తన తొండంలోని చల్లని జలాలు చల్లి సేదతీర్చే సింహకిశోరాలతోనూ మనోహరంగా ఉండేభాగీరథీ తీరంలో ఉన్న ప్రశాంత తపోవనాలలో పండ్లు తింటూ మునిపత్నులతో ముచ్చటలాడుతూ ఒక్కనాడు గడపాలని మనసు పడుతున్నాను'' అన్నది జానకి.

ఇందు గంగా తీరంలోని తపోవనాల ప్రశాంతత, పవిత్రతా ప్రకటిత మవుతున్నాయి. గర్భవతియైన సీత అంతరాంతరాల్లో పొంగిపొరలే మాతృవాత్సల్యం అభివ్యక్తమవుచున్నది.

# 42

''సౌమిత్రీ! భయ మయ్యెడిన్ నుడువుమా క్ష్మాదేవి జామాత, యా
శ్రీమత్పద్మదళాక్షుఁ, డా రఘుకులక్షీరాబ్ధి పూర్ణేందుఁ, డా
హేమక్ష్మాధరధీరుఁ, డా యసురమత్తేభేంద్ర హర్యక్షుఁ, డా
శ్యామాంగ ప్రభుఁ, డా మహాప్రభుఁడు లెస్సైన్ యున్నవాఁడే
పురిన్?'' (6-264)

చిక్కని వైదర్భీరీతిలో నడచిన చక్కని పద్యమిది.

రాముని ఆజ్ఞానుసారం లక్ష్మణుడు సీదేతావిని రథమెక్కించుకొని గంగానదీ తీరారణ్యంలో విడిచిపెట్టి రావటానికి తీసుకువెళ్ళుతున్నాడు. త్రోవ పొడుగునా సంభవించిన దుర్నిమిత్తాలకు జానకి హృదయం కంపించి పోయింది. ఇద్దరూ గంగదాటి అద్దరికి వెళ్ళారు వదినెగారికి రామాజ్ఞ ఎరిగించలేక కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్న లక్ష్మణునితో సీత పై విధంగా అంటుంది.

ఏదో మహాప్రమాదం ముంచుకు వచ్చిందని ఊహించిన వైదేహికి మును ముందుగా చిన్నత్త సుమిత్రాదేవీ, కన్నతల్లి భూదేవీ స్మృతిపథంలో మెదిలారు. తర్వాత తన ప్రభువు కేదైనా అమంగళం ప్రాప్తించిందా అని అనుమానం కల్గింది.

అందుకే 'సౌమిత్రీ !' అని లక్ష్మణుణ్ణి సంబోధించింది. సుమిత్రమ్మ అంటే ఆమెకు అంత అభిమానమూ, ఆప్యాయతా. రాముణ్ణి పేర్కొంటూ ''క్ష్మాదేవి జామాత'' అని ప్రారంభించింది. అమ్మంటే ఎంత గౌరవమో! ముందు భూదేవి అల్లుడుగా, శ్రీమత్పద్మ దళాక్షుడుగా, రఘుకుల చంద్రుడుగా, మేరునగ ధీరుడుగా, రాక్షస విజేతగా, శ్యామసుందర మూర్తిగా, మహా ప్రభుడుగా శ్రీరాముడు సీతా హృదయంలో సాక్షాత్కరించాడు. ఆ స్వామి క్షేమంగా ఉన్నాడు గదా అని ప్రశ్నించింది జనక పుత్రి.

'శ్రీమత్పద్మ దళాక్షుడు' అన్న విశేషణం శ్రీరాముని సౌందర్యానికీ; 'రఘుకుల క్షీరాబ్ధి పూర్ణేందుడు' అన్నది వంశ ప్రశస్తికీ; 'అసుర మత్తేభేంద్ర హర్యక్షుడు' అన్నది మహా వీరత్వానికీ వ్యంజకాలు.

అలంకారం - రూపకం.

## 43

''ఇంతకుఁ బూని వచ్చి వచియింపక పోదునె ? విన్ముతల్లి ! దు
ర్భ్రాంతులు, 'దైత్యు చేఁబడిన సీతను గ్రమ్మఱ నేలుచున్న వాఁ
డెంత విమోహి రాముఁ'డని యెగ్గులు పల్కిన నాలకించి భూ
కాంతుఁడు నిందఁ జెంది నినుఁ గానల లోపల డించి రమ్మనెన్.''

(6–267)

''మను మార్గ నిరతుడై మను మానవపతి వినుమానెనొ, నను మానెనొ అనుమానము మాని తెల్పు'' మన్న జనకజతో సౌమిత్రి కన్నీళ్ళతో చేతులు మోడ్చి చెప్పలేక చెప్పలేక తప్పనిసరిగా రామాజ్ఞ చెప్పాడు.

'తల్లి!' అన్న సంబోధన వదినెగారి యందు మరదికి గల భక్తి ప్రపత్తులకు సూచకం. 'భూకాంతుడు' అన్న విశేషణం రాముని రాజ ధర్మాన్ని స్ఫురింపజేస్తుంది.

## 44

''మితిలేని మిడి మేలంపు మెకములు
సకియల బలఁగమే ? జనని ! నీకుఁ
బరికింపరాని యీ బలుమలల్ నవరత్న
మయ చంద్రశాలలే ? మాత ! నీకుఁ
గడు భీతి ముంచు నీ గహనముల్ విహరింప
దగిన పూఁదోటలే ? తల్లి ! నీకుఁ
ఘోర నక్ర భుజంగ కోటితో మలయు నీ
హ్రదములు కొలఁకులే ? యంబ ! నీకుఁ
బంధురములైన యీ మహా ప్రస్తరంబు
లిందు మణివేదికలె ? జనయిత్రి ! నీకుఁ
గట కటా ! యొంటి నిచ్చోట నెటుల నిలిచె
దమ్మ ! నీ యునికి కేమందు నమ్మ ! నేను.'' (6-274)

ఈ పద్యంలో లక్ష్మణుని హృదయావేదన వెల్లడై కరుణరస పరిపోషకమవుతున్నది. భోగభాగ్యాలతో తులతూగ వలసిన శ్రీరామచంద్రుని దేవేరికి ప్రాప్తించిన శోచనీయదశ కన్నులకు కట్టింపబడినది.

యతి స్థానంలో కుదురుకొన్న జనని, మాత, తల్లి, అంబ, జననిత్రి, అమ్మ అనే సంబోధనలు సుమిత్రానందనుని శోకావేశానికి ప్రతీకలు.

# 45

*"కటకట లక్ష్మణా! పిడుగు కంటెను బెట్టిదమైన మాట నేఁ*
*డిటు విని యుండియున్ బగుల దింతలు నింతలు గాదు గుండె యె*
*ప్పటి వలె నున్న;దీ కటిక ప్రాణముతో నసువుల్ భరించి యి*
*య్యటవిని యింక నే వలన నాపద లొందఁగ నున్నదాననో!"*

(6-282)

రామాజ్ఞ విని ''హా ! తల్లీ!'' యని నేలవ్రాలి తెలివి తెచ్చుకొని కంటికి కడివెడుగా విలపించుతున్న సీతమ్మ సౌమిత్రితో పలికిన పలుకులు.

''నా గుండెలు బండవి. నా ప్రాణాలు మొండివి. పిడుగుకంటె బెట్టిద మైన వార్త వినికూడా నా గుండెలు బద్దలు కాలేదు. ఈ మొండి ప్రాణాలతో ఈ అడవిలో ఇంకా ఎన్ని ఇక్కట్టులు అనుభవించవలసి ఉందో !'

పిడుగుపడితే కొండైనా బద్దలౌతుంది. పిడుగుకంటే భయంకరమైన వార్త వినికూడా నా గుండెలు పగులలేదంటే ఇవి రాతికంటే కఠినమైనవని భావం.

# 46

*''కలవరపాటుతో నన్నది తెల్పితివా? కాక, పరాకునఁ దప్పు వింటివో?*
*కల నయినన్ రఘూద్వహుఁడు కానలలో నను ద్రోయఁబంపునే?*
*తెలిసి గణింపు లక్ష్మణ! మతి భ్రమ యైనదొ? హా సహింపు మి*
*ప్పలుకు తెలుంగ కంటి వెతఁ బాటిలె, నీ కొక భ్రాంతి యున్నదే?''*

(6-283)

సీతకు సందేహం కల్గింది. సౌమిత్రి కలవరపాటుతో అన్నాడో లేక పరాకుగా విన్నాడో అని. తన ప్రభువు తనను కలలోకూడా కానలకు పంపడని ఆమె విశ్వాసం. ''మళ్ళీ బాగా తెలివి తెచ్చుకొని చెప్పు. లక్ష్మణా !'' అంటుంది. ''ఏదైనా పొరపాటు పడ్డావేమో'' అంటుంది. ఇవన్నీ ఆమె ఆవేశంలో అనరి

మాటలు. మళ్ళీ కొంచెం తెప్పరిల్లి "అయ్యో మన్నించు మరదీ ! ఏదో ఏదో అన్నాను. నీ కేమిటి పొరపాటేమిటి ! నాకు కష్టం వాటిల్లిన మాట వాస్తవం" అంటుంది. ఈ పద్యంలో సీత మనస్సులోని అలజడీ ఆందోళనా ధ్వనించు తున్నాయి.

# 47

"ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును నన్నిఁక రామచంద్రుడున్
గన్నులఁ జూడఁ గల్గ దొకొ ? కల్గక యుండినఁ బ్రాణమేల పో
దన్న ? రఘు ప్రవీరు చెవులారఁగ నింతయు దెల్పు, నాదు మే
నున్నది చెంత గంగ మడుఁగున్నది యైనటు లయ్యెడున్ దుదిన్."
(6-284)

"అన్నా ! సౌమిత్రీ ! ఈ జన్మలో మళ్ళీ ఎన్నటికైనా మేమిద్దరం పరస్పరం చూచుకుంటామా ! అటువంటి భాగ్యం ఈ అభాగ్యురాలికి ప్రాప్తిం చనినాడు ఈ ప్రాణాలుండి ఏం ప్రయోజనం ! ఇదిగో ! ఈ నా దేహమున్నది. అదిగో ! అక్కడ గంగ ఉన్నది. చివరకు ఎలా వ్రాసిపెట్టుంటే అలా అవుతుంది. ఈ మాట ఆ రఘువంశ మహా వీరునికి వీనుల విందుగా వినిపించు నాయనా !" అన్నది జానకి.

జానకి సాధ్వి. ఆమెకు సర్వస్వమూ రామచంద్రుడే. ఆ స్వామిని చూడలేకపోతే ఇంకా తాను బతకటం దేనికి ?

ఈ పద్యంలో రామునికి 'రఘూద్వహుడు', 'రఘుప్రవీరుడు' అన్న రెండు విశేషణాలున్నాయి. మొదటిదానికంటే రెండోది వేడీ వాడీ, కలది.

రఘువంశ మహావీరుడు కనుకనే వంశ గౌరవానికి లోటు వాటిల్లకుండా నన్ను పరిత్యజించాడని వ్యంగ్యం.

గంగలో దూకి ప్రాణాలు వదిలిపెడతా ననకుండా "నాదు మేనున్నది చెంత గంగ మడుగున్నది" అనటంలో సున్నితమైన ధ్వని ఉన్నది.

# 48

*"పతి మదినెంచెనేమొ ? తనుఁ బాసి యశోక వనంబు లోపలన్*
*బ్రతుకదె పెక్కునాళ్ళనుచుఁ; గ్రమ్మఱఁ దాఁ జనుదెంచు శత్రునిన్*
*హతునిగఁ జేయు, నేలు నను నాసగదా బ్రతికించె నాఁటికా*
*గతి; నిఁక నేమి యాసగొని కాయము నిల్పుదుఁ ? దెల్పు*
*మిన్నియున్."* (6-285)

**నిరాశతో** నిస్పృహతో తనుత్యాగానికి నిశ్చయించుకున్న జనకపుత్రి సౌమిత్రితో అంటున్నది—

''అప్పుడు అశోకవనంలో నా వియోగాన్ని సహించి ధైర్యం వహించి జీవించి ఉండలేదా ?" అనుకొన్నారేమో ఆయన ?

''వారు వస్తారు! పగవాణ్ణి సంహరిస్తారు! నన్ను **కాపాడుతారు!** అనే ఆశతో ఆనాడు బ్రతికాను. ఈనాడు ఏ ఆశతో బ్రతికి ఉండేది ! ఈ మాటకూడా మీ అన్నయ్యతో చెప్పు నాయనా!''

ఇచ్చట 'పతి' అన్న పదానికి భర్తగారని అర్థం చెప్పటం కంటే ప్రభువు గారని అర్థం చెప్పుకోటం ఉచితంగా ఉంటుంది.

# 49

*''ఎఱుఁగని మూఢు లాడుకొను నెగ్గులకున్ భయమంది యప్పుడే*
*కఱకు మనంబుతో విభుఁడు కాననసీమకుఁ బంచెఁగాక య*
*త్తఱిఁ గొకసారి నన్ బిలిచి తెల్పి మనోవ్యథ తీర్చి నన్ను నే*
*మఱ నని పంపడయ్యె; నభిమానముఁ గూర్మియునెందు బోయెనో?"*
(6-286)

''క్షుల్లక జన దుష్టవచోభల్ల కదంబాలకు'' తల్లడిల్లి భూ వల్లభుడు నిన్ను అరణ్యాలకు పంపాడన్న లక్ష్మణుని మాటలు స్మృతికి తెచ్చుకొని జానకి అంటున్నది—

''ఎవరో ఎరుగని మూర్ఖులు ఏవో ఎగ్గులు పలికారని అన్నీ ఎరిగిన తాను భయపడి కర్కశ హృదయంతో క్షణాలమీద నన్ను వనాలకు పంపించారు. బాగానే ఉంది. కాని అలా పంపేముందు ఒక్కసారి నన్ను పిలిచి దగ్గర కూర్చోపెట్టుకుని పరిస్థితి నాకు వివరించి నన్ను ఓదార్చి నా మనోవ్యథ

తీర్చి నిన్ను మరచిపోనని చెప్పి పంపిస్తే ఎంత బాగుండేది! నా కెంత సంతోషంగా ఉండేది! కానీ మీ అన్నయ్య అట్లా చెయ్యలేదు. నామీద ఆయన చూపించే ఆదరం అభిమానం అనురాగం అన్నీ ఎక్కడ మాయమైనాయో!''

ఏమీ ఎరుగని పామరుల పలుకులు పట్టించుకొని అన్నీ ఎరిగిన తాను ఇంతపని చేయటం - అందులోనూ-ఇలా చేయటం అన్యాయమని భావం.

# 50

*''ఆ కరుణ యా ప్రసన్నత*
*యా కూరిమి యా ప్రియోక్తి యాగారవమున్*
*గాకుత్స్థుఁడు మఱచెఁ గ*
*యాకస్మికముగ జనించు నపవాదమునన్."*

ఈ పద్యంలో ''ఆ'' కరుణ, ''ఆ'' ప్రసన్నత, ''ఆ'' కూరిమి, ''ఆ'' ప్రియోక్తి, ''ఆ'' గారవం అని ఐదుసార్లు ప్రయుక్తమైన తచ్ఛబ్దం వల్ల సీతా రాముల అపారమైన అనన్య సామాన్యమైన అన్యోన్యానురాగం ధ్వనిస్తున్నది.

''ఎంత దయ చూపించేవారు! ఎంత ప్రసన్నంగా ఉండేవారు! ఎంత ప్రేమ కురిపించేవారు! ఎన్ని తీయని మాటలు చెప్పే వారు! ఎంతగా లాలించి పాలించే వారు! అనుకోకుండా వచ్చిన ఈ అపవాదం అన్నింటినీ తుడిచి పెట్టింది.''

# 51

*''ఆ కర్ణాయత నేత్రమై మణి మయోద్యత్కుండల ద్వంద్వ శో*
*భాకీర్ణాంచిత గల్లమై, సురదనంబై, సుందర భ్రూయుతం*
*బై, కమ్ర స్మిత చంద్రికా విలసితంబై యొప్పు శ్రీరాము మో*
*మీ కాయంబునఁ జూచు భాగ్యమిఁక లేదేమో? సుమిత్రాత్మజా!''*

(6-288)

తమ అన్యోన్యానురాగం స్మృతికి రాగానే సీతమ్మ హృదయ దర్పణంలో శ్రీరాముని ప్రసన్న మధురమైన ముఖం ప్రతిబింబించింది. ''ఆ కర్ణాంతాలైన ఆ విశాల నేత్రాలూ, రత్న కుండల దీప్తులు ప్రసరించే ఆ చిక్కని చెక్కిళ్లూ, సురుచిరమైన దంత పఙ్క్తీ, ఆ అందాల కనుబొమలూ, ఆ మధుర మంజుల

మంద స్మిత చంద్రికలూ ఎంత బాగుందీ ఆ ముఖం! అటువంటి శ్రీరామ చంద్రుని ముఖాన్ని సందర్శించే అదృష్టం ఈ జన్మకు ఇక లేదేమో సౌమిత్రీ!' అని వాపోయింది వైదేహి.

'క్రమ స్మిత చంద్రికా విలసితం' అనటం వల్ల ముఖానికి చంద్రత్వం ఆరోపిత మౌతున్నది.

అలంకారం - స్వభావోక్తి.

శ్రీరాముని ముఖంలాగానే ప్రసన్న సుందరమైన పద్యమిది.

# 52

*''వనముల కేల వచ్చితివి? వల్లభునిం బెడఁబాసి యొంటిగా*
*నని మునిపత్ను లెల్ల గుమియై యడుగన్ ధృతిమాలి వారికే*
*మని వివరింతు? నింత విపదంబుధి నే కరణిన్ దరింతు? నే*
*యనువున నీ ప్రతిక్షణ మహాయుగముల్ గ్రమియింతు? లక్ష్మణా!''*
(6-290)

సీత అంటున్నది-

''లక్ష్మణా! నన్ను ఈ వనాంతర భూముల్లో వదలిపెట్టి పోతున్నావు. గంగా తీరంలో తపోవనాలలో నివసించే ముని పత్నులందరూ నా చుట్టూ మూగి 'అమ్మా! అరణ్యానికి ఎందుకు వచ్చావ్?' వని అడిగితే నేనేం చెప్పేది? 'భర్తను వదలిపెట్టి ఒక్కదానివే వచ్చావేమంటూ వారు నన్ను ప్రశ్నిస్తే నా గుండెలు క్రుంగిపోవా? నోరెత్తి వారితో ఎట్లా మాట్లాడేది? ఏ మని సమాధానం చెప్పేది? వారు ఇంకా ఆరాలు తీసి అడిగితే నా విషాదగాథను వారికి ఎట్లా వివరించేది? కడలేని ఈ కష్టాంకడలిలో నా జీవితనావను ఎట్లా నడిపేది? పరిత్యక్త నైన నేను ప్రతిక్షణం ఒక్కొక్క మహాయుగంగా ఎట్లా గడిపేది?''

# 53

*రమణి మఱికొంత వడి దాఁక రథముఁ జూచుఁ*
*దరుణి మఱికొంత సేపు కేతనముఁ జూచుఁ*
*గాంత మఱి మీఁద రథపరాగంబుఁ జూచు*
*పడఁతి మఱి యంతటను వట్టి బయలు సూచు.* (6-300)

''జననీ! నీవు మహా పతివ్రతవు. నీ సౌశీల్య మిల్లాంద్ర కెల్లను మేల్బంతి''- ''రఘూ ద్వహాంఘ్రి యుగళీలగ్నాత్మమై యుండుమీ'' యని నే నెవ్వడ విన్నవింపఁ బతిఁ బాయంజేసి నిన్నొంటి డించిన పాపాత్ముఁడ!'' అన్నాడు లక్ష్మణుడు.

''అడలకు మన్న! నీకు వసుధాధిపు నానతి దాఁట వచ్చునే యిడుములఁ జెందుమంచు విధి యీధర నన్ను సృజించి యుండఁగాఁ గడవగ నెవ్వరో పుదురు?'' అన్నది జానకి.

''అన్నా! లక్షణా! ఆలస్యం దేనికి! ఇక నీవు అయోధ్యకు వెళ్ళు'' అన్నది. ''అత్తలకు అభివందనాలు అందించు''మన్నది. తనకు మారుగా పతికి అతిభక్తితో మ్రొక్కుమన్నది. ''తనకు జన నిఁద రాకుండా వనవాసం చేస్తా'' నన్నది. లక్ష్మణుడు ''అల్లన మ్రొక్కి కాళ్ళ వడఁకాద ప్రదక్షిణ మాచరించి'' ''ధేనువును బాయఁజాలని వత్సము'' వలె కాళ్ళురాక, వెళ్ళలేక వెళ్ళి రథమెక్కాడు.

రథం వెళ్ళిపోతున్నది. దూరంగా-ఇంకా దూరంగా-వెళ్ళిపోతున్నది. ఇక్కడ సీత కన్నార్పకుండా అటే చూస్తూ ఉన్నది-కొంతసేపు రథం కన్పించింది. ఆ తర్వాత రథకేతనం, ఆ తర్వాత పరాగం—ఆ తర్వాత ఏమీ కన్పడలేదు.

ఈ గీత పద్యంలో సీత దృష్టిని పురస్కరించుకొని రథగమనాన్ని స్ఫురింప జేరాడు కవిరాజు పాపరాజు.

# 54

*చూచి చూచి చొక్కి స్రుక్కి తాలిమి దక్కి*
*వగలఁ బొగిలి యూర్పు సెగల నొగిలి*
*దిగులు దగులఁ గుంది వగఁ జెంది బెగడొంది*
*యలసి సొలసి మూర్ఛ లొలసి తెలిసి* (6-301)

ఈ పద్యంలో అడుగడుగునా ఏర్పడిన అను ప్రాసల్లో సీతాదేవి నిరీక్షణా నిస్పృహా, నిరాశా, దిగులూ, విచారమూ, వేదనా, ఆవేదనా స్ఫురిస్తున్నాయి

## 55

"ఒడి మీఁద నిడుకొని యురముపై జేర్చుట
  చేరిక కది కడసారి యేమొ?
చెక్కుఁ జెమ్మటలను చెఱఁగునఁ దుడుచుట
  చెలిమికి నది తుది చీటి యేమొ?
పుక్కిటు తావి కప్పురవీడె మిచ్చుట
  యనురాగమున కది యవధి యేమొ?
కోరిన పని కియ్యకొను టది కరుణాప్ర
  బంధమ్మునకు ఫలగ్రంథ మేమొ?
మోము మోమునఁ గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపుఁ బనికిఁ దీఱుదల యేమొ?
యెల నగవు దేరఁ జూచి లోపలి కనుచుట
మేలు చిన్నెల కది పొలిమేర యేమొ? (6–303)

లక్ష్మణుడు వెళ్ళిపోయిన అనంతరం గంగాతీరంలో ఒంటరిగా కన్నీరు కారుస్తున్న కరుణామయి సీత ఉద్విగ్న హృదయంలో ఉవ్వెత్తుగా లేచే విచార వీచికలు గోచరిస్తున్నాయి ఈ పద్యంలో-

"క్రిందటి రాత్రి నా ప్రభువు నన్ను ఎంతగా గారవించాడు - ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఉరంపై చేర్చుకున్నాడు. ఉత్తరీయం చెరగుతో చెక్కిళ్ళ మీది స్వేద బిందువులు తుడిచాడు. కప్పుర వీడె మిచ్చాడు. కోరిన కోర్కె తీరుస్తానన్నాడు. ముఖంపై ముఖం చేర్చి ముద్దు పెట్టుకున్నాడు. చిరునవ్వులు చిందిస్తూ నావైపు చూచి నన్ను లోపలికి పంపించాడు. నేనూ ఆనంద పార వశ్యంలో పొంగి పోయానే కాని అదే మా అనురాగమయ దాంపత్యానికి తుది వీడ్కోలని భావింపలేదు."

## 56

"రాజ కులాభి రాముఁడగు రామునిదేవి! విదేహధారుణీ
రాజకుమారి! పంక్తిరథ రాజ బిడౌజుని పెద్దకోడలీ
రాజముఖీ లలామ; యలరాజ సహోదరిఁ బోలు నీమెకున్
బూజలు సేయఁగాఁ దగుఁ దపోధన కాంతలు మీర లందరున్."

(6-319)

పతిపరిత్యక్తయై గంగా ప్రాంత కాంతారంలో ఏకాంతంగా శోక వ్యాకుల యైన వైదేహిని వాల్మీకి మహర్షి ఆదరించి ఆశ్రమానికి కొనివచ్చి ముని కాంతలతో అంటున్న మాటలివి-

''ఈమె సామాన్యురాలు కాదు. క్షాత్రకులాలంకారమైన శ్రీరామచంద్రుని దేవేరి. జనక భూపతుల వారి గారాబు కూతురు. దశరథ రాజేంద్రుని పెద్ద కోడలు. రమాదేవితో సమానురాలైన ఈ రమణీలలామను మీరంతా గౌరవాభిమానాలతో కంటికి రెప్పలా కనిపెట్టి ఉండాలి.''

పై విశేషణాలవల్ల క్రమంగా సీతాదేవి సౌభాగ్య సౌశీల్య సౌహార్ద సౌందర్య సంపన్నతలు ధ్వనిస్తున్నాయి.

# 57

*రంగారు బంగారు చెంగావులు ధరించు*
*శృంగారవతి నారచీర లూనె !*
*భూజనంబులు మెచ్చు భోజనంబు లొనర్చు*
*కమలాక్షి కందమూలములు నమలె !*
*చంద్రకాంత విశాల చంద్రశాలల నుండు*
*జవ్వని వనిఁ బర్ణశాల నుండె ;*
*సురులతో శ్రీరాము నురముపైఁ బవళించు*
*బాలికామణి యొంటి బవ్వళించెఁ!*

*గన్నుసన్నల శుద్ధాంత కాంత లాచ*
*రించు సేవలు మెచ్చని కాంచనాంగి*
*యొగ్గె ముని ముగ్ధకాంతాకృతోపచార*
*విధికి; నెంచ నసాధ్యంబు విధికిఁ గలదె ?* (6-322)

వాల్మీకులవారి పర్ణకుటితో వల్కలములు ధరించి, కంద మూలాలు భుజించి వనవాసం సాగించుతున్న జానకీదేవి దీనదశను చూచి గుండెలు కరిగిన కవి కన్నీళ్లలో గంటంముంచి వ్రాసిన సీస పద్యమిది.

# 58

''ఈ ముఖకాంతు ! లీనగవు ! లీకనుదామర ! లీ మెలుంగు ! లీ
చామనచాయ ! లీ యెగు బుజంబుల పొంకము ! లీ యురంబు ! లీ
కోమల మూరు ! లీ వచన సంఘనలున్ గనుఁగొన్న గట్టిగా
రాముని లీల మించి రభిరామ శరీరులు వీరలెవ్వరో ?'' (8-58)

విపంచికలు ధరించి, శ్రుతులు మేళవించి కమని కంఠస్వరాలతో రామాయణ శ్లోకాలను వీనుల విందుగా గానం చేస్తున్న కుమార కుశలవులను అవలోకించి ఆనందపరవశులై రాముని కొలువుకూటంలోని సభ్యులు గుసగుసలాడుకుంటున్నారు. ఆ సందర్భములో అందమైన పద్యమిది.

''ఆ చిన్నారి మోములూ ఆ చిరునవ్వులూ ఆ కనుదమ్ములూ ఆ కంఠస్వరాలూ ఆ బుజాల సౌరూ ఆ మాటలతీరూ అచ్చం రాముని నోట్లోనుండి ఊడి పడ్డట్టున్నారు ! మరి ఈ చిరంజీవు లెవ్వరో !''

# 59

''హారకిరీట కుండల భుజాంగద వస్త్ర సుగంధ మాల్యముల్
వీరు ధరింపకే జటిల వేషము లేటికిఁదాల్చిరో ! శుభా
కార విలాస సంపదలఁ గంతు జయంతుల ధిక్కరించి నా
రే ఋషి పుత్రులో ? ఋషుల కెక్కడి వీ మహనీయ రూపముల్ ?''
(8-59)

ప్రేక్షకుల మనస్సులలో ఎన్నో సందేహాలు - ''వీరు శ్రీ రాముని కుమారులా ? ముని కుమారులా ? రాముని కుమారులైతే హార కిరీటకేయూరాలు ధరించక నార చీరలు ధరించారేమిటి ? ముని కుమారులే అయితే కంతుజయంతులను అపహసించే ఈ అందచాందాలూ ఈ ఆకారరేఖలూ వీరికి ఎక్కడినుంచి వస్తాయి ?''

# 60

దినదిన మిట్లు వచ్చి జగతీ సతి మన్మలు పువ్వుఁదేనె వం
చినగతిఁ, గ్రపున్ రసము చిందిన కైవడి, జాజి సొట్లముల్
ముసుకొని విప్పినట్లు, లతిమోహవగాన కళానిరూఢిన
య్యనఘలు ప్రోల నచ్చరిత మింపెసఁగన్ వినిపించుచున్నెడన్.
(8-70)

"మధురమూ" "మధురాక్షరమూ" రసభరితమూ అయిన రామ చరితాన్ని "తంత్రీలయ సమన్వితంగా" గానం చేస్తున్నారు "కుశీలవు"లైన కుశలవులు. భూదేవి గాదిలి మనుమలైన ఆ బాలగాయకుల గానసౌభాగ్యం పూదేనెలు చిప్పిలినట్లుగా అందరికీ వీనులవిందు చేసింది.

ఈ పద్యంలో పాపరాజ కవీంద్రుడు ఉత్తమ కవిత్వ లక్షణాలను భంగ్యంతరంగా ధ్వనింపజేశాడు.

# 61

*"బుధనుతుఁడౌ ప్రచేతసుని పుత్రుఁడనైన క్రతులెల్ల నేర్చినే*
*నధిక తపోవిభూతిఁ జెలువందిన యసత్యము లాడ నేర్తునే?*
*యధిప! మనోవచఃక్రియల నన్యు మెఱుంగదు సీత; క్షీరవా*
*రిధి సుతకున్ హిమాచల వరేణ్యజకున్ బ్రతి సద్గుణోన్నతిన్."*

(8-84)

గోమతీ తీరంలో శ్రీరాముని నిండు కొలువులోనికి సీతను వెంటపెట్టుకొనివచ్చి సమస్తపౌర జానపద సమక్షంలో రఘు వీరుని పురోభాగంలో నిలిచిన వాల్మీకి మహర్షి శేఖరుడు గంభీరకంఠంతో రాముని సంబోధించి ఇలా పలికాడు —

"దినకరవంశతిలకా! ఈ పృథ్వీపుత్రి మహాసాధ్వి. ఈమె పాతివ్రత్యాన్నీ సత్యౌన్నత్యాన్నీ తెలిసికూడా నీవు జనాపవాదానికి భీతిల్లి నిండు చూలాలిని నిర్దాక్షిణ్యంగా అడవులకు వెడలనడిచావు. ఈమెకు నేను నా తపోవనంలో ఆశ్రయమిచ్చాను. నా ఆశ్రమంలో ఈ తల్లి కుశలవులనుకన్నది. ఈ బిడ్డలిద్దరూ నీ పుత్రులు."

రాముడు మాటాడలేదు.

"ఈమె నీ సహధర్మచారిణి! ఈ కుశలవులు నీ కుమారులు. వీరిని పరిగ్రహించు" అన్నాడు మహర్షి.

రాముడు మౌనం వహించాడు.

ఆ సందర్భంలో మళ్ళీ వాల్మీకుల వారు అందుకున్నారు - "రాజా! నేను విద్వద్వంద్యుడైన ప్రచేతసుని నందనుణ్ణి. సమస్తవేదాలూ చదివినవాణ్ణి.

మహా తపస్సంపన్నుణ్ణి. అసత్యాలు పలకడం నా చేత కాదు. మనసా వాచా కర్మణా నీ స్మరణం తప్ప అన్యమెరుగని ఆదర్శ సతీమణి సీత. ఈ ఉత్తమ సాధ్వికి సద్గుణసంపత్తిలో క్షీర వారాశి పుత్రియైన శ్రీదేవి, పర్వతరాజ పుత్రియైన పార్వతీదేవీ సాటి వస్తారు. ఈమెను పరిగ్రహించు.''

# 62

*''రామ స్వామి పదాంబుజంబు లెద నారాధింతునేనిన్, సదా*
*రామాజ్ఞన్ జరియింతునేనిఁ దగు జాగ్రత్స్వప్న సుప్త్యాదులన్*
*రామున్ దప్పనిదాన నౌటయు యథార్థంబేని, నా తల్లి! యో*
*భూమీ! యీ యెడఁ ద్రోవఁ జూపి ననుఁ గొంపోవమ్మ! నీలోనికిన్''*

(8-93)

వాల్మీకి మాటలు విని కొలువులోని వారంతా చలించి పోయారు. రాముడు బద్ధాంజలియై ''స్వామీ! అగ్నిప్రవేశం వల్ల సీత పాతివ్రత్యం వెల్లడయింది. ఈమె 'లోకైక పావని' అని తెలిసికూడా లోకాపవాదాన్ని భరించలేక ఇంతపని చేశాను. ఈ నా అపరాధం క్షమించండి. నాపై ఆగ్రహించకండి. ఈ మహాజనుల సన్నిధిలో జానకి శపథం చేస్తే చాలా బాగుంటుంది. ప్రజలు సంతోషిస్తారు'' అన్నాడు.

అప్పుడు వాల్మీకి వెనుక ఉన్న సీత శపథం చేసేటందుకు ముందుకు వచ్చింది. తలెత్తి రాముని ముఖం చూడలేకపోయింది. హృదయేశ్వరుని పదకమలాలు ఎదతో పదిల పర్చుకుంది. అవనత ముఖి అయింది. కన్నతల్లి భూదేవిపై చూపు నిల్పింది. కరకమలాలు మోడ్చింది. అచ్చటి వారంతా ఆశ్చర్యచకితులౌనట్లుగా ఆమె ఈ విధంగా పలికింది–

''నా స్వామి యైన రాముని చరణ కమలాలే సర్వదా నాకు ఆరాధ్యాలు. రామచంద్రుని ఆజ్ఞ నాకు సదా శిరోధార్యం. జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థ లందు సైతం నేను రామునికే అంకితమైనాను. ఈ నా మాటలు యథార్థము లైనట్లైతే తల్లీ! భూదేవీ! నాకు మార్గం చూపించు! నన్ను నీ చల్లని ఒడిలో చేర్చుకో!''

ఈ సందర్భంలో వాల్మీకి రామాయణంలో ఈ క్రింది శ్లోకాలు ఉన్నవి -

''యథాహం రాఘవాదన్యం మన సాపిన చింతయే
తథామే మాధవీ దేవీ వివరం దాతు మర్హసి.''
''మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే
తథామే మాధవీ దేవీ వివరం దాతు మర్హసి.''
''యథై తత్ సత్యముక్తం మే వేద్మి రామాత్ పరం న చ
తథామే మాధవీ దేవీ వివరం దాతు మర్హసి.''

వాల్మీకం లోని ఈ మూడు శ్లోకాల భావాన్ని గుదిగ్రుచ్చి ఒకే పద్యంలో పలికించాడు తెలుగు కవి. అవమానంతో క్రుంగిపోతున్న ఆ మహా సాధ్విని ఆ శోకమూర్తిని ఆ కరుణామయిని అంతకంటే ఎక్కువ సేపు ప్రజల మధ్య నిలబెట్టటం భావ్యం కాదనుకున్నాడేమో !

సీతాదేవి శపథానికి భూదేవి హృదయం బద్దలైంది. కరుణామయి జానకి కన్నతల్లి గర్భంలో కలిసి పోయింది. భూజాత భూమాత ప్రేమాంకంలో చల్లగా విశ్రాంతి తీసుకుంది.

శ్రీరాముడు నిస్తబ్ధుడైనాడు. ప్రజలు నిశ్చేష్టులైనారు. వాల్మీకి నిర్విణ్ణుడైనాడు. ఎవరు ఏమైతేనేం సీత మాత్రం ఇక మనకు లేదు. ఈ రాకాసి లోకంలో ఏకాకిగా నిలువలేక అపనిందలు భరించలేక అన్యాయం సహించలేక ఆ బంగారు తల్లి తన కన్నతల్లి చల్లని కడుపులో విలీనమై పోయింది.

ఐనా ఆ త్యాగమయి అమర స్వరూపం కవుల కలాలలో సహృదయుల ఆర్ద్ర నేత్రాలలో ప్రజల హృదయ క్షేత్రాలలో శాశ్వతంగా నిలిచే ఉంటుంది.



తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3